ప్రథమముద్రణ : 1993

ప్రతులకు :
టాగూర్ పబ్లిషింగ్ హౌస్
కాచిగూడా చౌరస్తా
హైదరాబాదు

గాయత్రి బుక్ షాప్
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు.

**వెల : రూ. 20-00**

ముద్రణ:
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
**1-1-517/బి/1, న్యూ బాకారం,**
**గాంధీనగర్, హైదరాబాదు-500 380**
**ఫోన్లు , 611413, 600547**

ఆచార్య కె. కమల
అధ్యక్షురాలు
సంస్కృతశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# స్నేహాంజలి

నియమము, నిగ్రహము, నిష్ఠ, జాగరూకత, లోకజ్ఞానము, వైదుష్యము, సమయపాలనము, భాగ్యము, కార్యశూరత్వము, స్మిత పూర్వాభిభాషణము, ప్రసాద గుణము, స్నేహశీలము- ఇవి అన్ని కలిసి ఆచార్య రవ్వా శ్రీహరిగారి వ్యక్తిత్వములో పరస్పర మైత్రితో కలిసి ఉండుట ఆ వ్యక్తిత్వములోని విశేషము.

ఆచార్య శ్రీహరిగారు గురుకుల క్లేశము ననుభవించి, గురువుల మన్ననలకు, వాత్సల్యమునకు పాత్రులైన భాష్యాంత వ్యాకరణ విద్వాంసులు. యాదగిరిగుట్టమీద నరసింహస్వామి ఏలుబడిలో ఉన్న సంస్కృత పాఠశాలలో వీరు విద్యాభ్యాసము నారంభించి, కేరళ సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి అంతేవాసులైనారు. ఆ తరువాత సీతారాంబాగ్ వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలలో శ్రీమాన్ కోయిల్ కందాడై శఠకోప రామానుజ స్వామివారు, శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రిగారివంటి ఉత్తమ విద్వాంసుల శిష్యులై, వ్యాకరణ శాస్త్రము నభ్యసించి, ఆ తరువాత తెలుగు, ఇంగ్లీషు భాషలలో ప్రవేశమును సంపాదించి, తెలుగులో ఎమ్.ఏ. పిహెచ్.డి. పట్టమును పొంది, ప్రస్తుతము హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయములో

ఆచార్య పదవిని, తెలుగు శాఖకు అధ్యక్ష పదవిని అలంకరించి, తెలుగు సంస్కృత వ్యాకరణములతోబాటు భాషాశాస్త్రములో వైదుష్యము సంపాదించుకున్నవారు. శ్రీహరిగారి మనస్సు పద స్వరూప నిరూపణముపై మొగ్గుచూపుటవారు తయారుచేసిన నల్లగొండ జిల్లా మాండలిక పదకోశము మొదలైన గ్రంథాలు నిరూపిస్తున్నవి.

సంస్కృత వ్యాకరణాన్ని పఠించే వారికి శబ్దమంజరి, ధాతుమంజరి, సమాస కుసుమావళి, రామాయణ సంగ్రహమును పఠించిన తరువాత లఘు సిద్ధాంత కౌముది కొంగు బంగారమే అవుతుంది. పాణిని మహర్షి అష్టాధ్యాయిని, కాత్యాయనుడు వార్తికములను, పతంజలి మహాభాష్యమును అనుగ్రహించి వ్యాకరణ మునిత్రయముగా పూజల నందుకుంటున్నారు. ఆ తరువాత పాణిని సంప్రదాయమునకన్న భిన్నములయిన ఐంద్ర వ్యాకరణాదులు, కాతంత్ర కాశ కృత్స్నాదుల సంప్రదాయములెన్నో వెలసినవి. రామాయణములో హనుమంతుని చూసి, అతని మాటలు విన్న శ్రీరామచంద్రు డతనిని గొప్ప వ్యాకరణవేత్తగా ప్రశంసించినాడు.

"నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్
బహు ప్రభాషతానేన న కించిదపశబ్దితమ్"- కిష్కింధాకాండము

బహుముఖములుగా విస్తరిల్లిన ఈ వ్యాకరణ సంప్రదాయాలన్నింటి లోనూ పాణినీయ సంప్రదాయమే శాస్త్రీయము, విశ్వతోముఖము, విస్తృతము, సమగ్రము. భాషలో కొత్త పదజాలాన్ని ధాతువుల నుండి నిష్పన్నం మొనరించుటకు వీలును కలిగి ఉన్నది అగుటవలన ఈ సంప్రదాయమే శాస్త్రాధ్యయనానికి హరిద్వారమయింది.

అష్టాధ్యాయికి క్రీ. శ. ఏడవ శతాబ్దములో వామన జయాదిత్యు లనువారు కాశికావృత్తిని వ్రాసినారు. కాశికకు జినేంద్ర బుద్ధి న్యాస మును, హరదత్తుడు పదమంజరిని వ్రాసి విస్తృతముగా భాషా సేవను చేసినారు. మహా భాష్యములో పతంజలి మహర్షి స్ఫోటవాదము ద్వారా శబ్ద నిత్యత్వాన్ని సాధించి, శబ్ద బ్రహ్మైకత్వమును ప్రతిపాదించగా, భర్తృ హరి ఈ స్ఫోటవాదాన్ని, తన "వాక్యపదీయ గ్రంథము"లో విస్తృతము చేసి, వ్యాకరణశాస్త్రానికి దర్శనముగా గౌరవమును కల్పించినాడు.

"ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతిరాసంసారం న దీప్యతే"

అని శబ్దజ్యోతియొక్క ఉజ్జ్వల ప్రకాశాన్ని లోకానికి చూపిన దార్శని కుడు భర్తృహరి. రాబర్ట్ బ్రౌనింగ్ అనే ఆంగ్ల మహాకవి **'Grammarian's Funeral'** అనే కావ్యంలో **'He lives to know'** అని చెప్పిన వాక్యము శాస్త్రజ్ఞులందరకు వర్తిస్తుంది.

ఇట్టి గ్రంథాలు ఎన్ని ఉదాత్త భావాలను ప్రపంచించినా ఒక శబ్ద రూప సిద్ధికై అష్టాధ్యాయి నలు మూలలా వెదకవలసిన స్థితిలో మార్పు రానందున భట్టోజీ దీక్షితులు అష్టాధ్యాయిలోని సూత్రాలను సంజ్ఞ, పరిభాష, సంధి, శబ్దాధికారము, కారకము, సమాసము, కృత్, తద్ధి తాంతాలు, స్త్రీ ప్రత్యయాలు అను ప్రకరణములలో విభజించి పూర్వార్ధ మును, ఉత్తరార్ధమును ధాతు ప్రక్రియతోనూ సరిజేసి, సిద్ధాంత కౌముదీ గ్రంథమును రచించి, వెన్నెలను కురిపించి శబ్ద నిష్పత్తికై చీకట్లో తడుముకొనక్కర లేకుండా చేసినారు. సిద్ధాంత కౌముదిలో శాస్త్ర చర్చ ఎక్కువగా ఉంటుంది. అంతకన్నా సంగ్రహముగా చెప్పే గ్రంథము మధ్య కౌముది. దానికన్న సంగ్రహముగా ఎన్ని తక్కువ సూత్రములతో

సరిపెట్టుకోవలసి వచ్చునో చూపించే గ్రంథము వరదరాజు రచించిన లఘు సిద్ధాంత కౌముదీ గ్రంథము. ఈ గ్రంథానికి హిందీలో విపులమయిన వ్యాఖ్యాన గ్రంథమున్నది.

తెలుగులో సంజ్ఞా, సంధి, కృత్ ప్రకరణాలకు మాత్రము టీకను వ్రాసి ఇదివరలో శ్రీహరిగా రొక గ్రంథాన్ని ప్రకాశింపజేసినారు. ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు డా॥ శలాక రఘునాథశర్మగారు లఘు సిద్ధాంత కౌముదీ గ్రంథము నంతటిని తెలుగు అనువాదముతో ప్రకటించి నారు ఇప్పుడు ఛాత్రులకు ఉపకరించు నను దృష్టితో కారక, సమాస, స్త్రీ ప్రత్యయ ప్రకరణములను శ్రీహరిగారు ప్రకటించుట అటు ఉపాధ్యాయులకు, ఇటు విద్యార్థులకు ఎంతో ఉపకరించును.

''ప్రాతిపదికార్థలింగ పరిమాణ వచనమాత్రే ప్రథమా'' ''షష్ఠీ శేషే'', ''సప్తమ్యధికరణే'', ''ఉపసర్జనం పూర్వమ్'' వంటి సూత్రము లకు శ్రీహరి గారు చేసిన వివరణము శాస్త్రమును అరటిపండు ఒలిచిపెట్టి నట్లుగా ఉన్నదని దిఙ్మాత్రముగా తెలుపవచ్చును.

అష్టాధ్యాయికి తెలుగులో వీరు వ్యాఖ్యానము వ్రాయుచున్నట్లు తెలియవచ్చినది. ఇట్టి గ్రంథములను వ్రాయు శక్తిని, ఆయుస్సును శేషా వతారుడయిన పతంజలిమహర్షి వీరికి ప్రసాదించుగాక!

ఇట్లు
స్నేహ ప్రాభృతమ్ము నందించుచు
కె. కమల

యద్యపి బహు నాధీషే
తథాపి పఠ పుత్ర! వ్యాకరణమ్.
స్వజనః శ్వజనో మా భూత్
సకలం శకలం సకృచ్ఛకృత్

అవ్యాకరణమధీతం
భిన్నద్రోణ్యా తరంగిణీతరణమ్
భేషజమపథ్యయుక్తం
త్రయమిదమకృతం వరం న కృతమ్.

ఓమ్

నమో మునిత్రయాయ

# లఘుసిద్ధాంతకౌముదీ

యేనాక్షరసమామ్నాయమధిగమ్య మహేశ్వరాత్
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః

యేన ధౌతా గిరః పుంసాం విమలైః శబ్దవారిభిః
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః

వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిమ్
పాణినిం సూత్రకారం చ ప్రణతోఽస్మి మునిత్రయమ్

ఓన్నమః పాణినికాత్యాయనపతంజలిభ్యః
శబ్దవిద్యాసంప్రదాయప్రవర్తకేభ్యో
మునిభ్యో మహద్భ్యో గురుభ్యః.

# అథ విభక్త్యర్థ ప్రకరణమ్

## (కారక ప్రకరణమ్)

సూ : ప్రాతిపదికార్థలింగ పరిమాణ వచనమాత్రే ప్రథమా 2-3-46

వృ : నియతోపస్థితికః ప్రాతిపదికార్థః - మాత్రశబ్దస్య ప్రత్యేకం యోగః - ప్రాతిపదికార్థ మాత్రే, లింగమాత్రాద్యాధిక్యే, పరిమాణమాత్రే, సంఖ్యామాత్రే చ ప్రథమా స్యాత్ - ప్రాతిపదిక మాత్రే - ఉచ్చైః, నీచైః, శ్రీః, జ్ఞానమ్; లింగమాత్రే - తటః తటీ, తటమ్; పరిమాణ మాత్రే - ద్రోణో వ్రీహిః, వచనం సంఖ్యా - ఏకః, ద్వౌ, బహవః.

సూత్రమున 'ప్రాతికార్థ, లింగ, పరిమాణ, వచన' అనునది ద్వంద్వ సమాసము. "ద్వంద్వాంతే శ్రూయమాణం పదం ప్రత్యేకం సంబధ్యతే" అను నియమానుసారము మాత్రశబ్దము ఈ ద్వంద్వ సమాసమునందలి అన్ని శబ్దములతో సమసించును. కాగా ప్రాతిపదికార్థ మాత్రే, లింగమాత్రే। పరిమాణమాత్రే, సంఖ్యామాత్రే అను అర్థము వచ్చును. లింగమాత్రే, అనుచోట లింగమనునది ప్రాతిపదికార్థమును విడిచి యుండదు. కనుక ప్రాతిపదికార్థముతోపాటు లింగము మాత్రమే అధికముగా భాసించునపుడు అని అర్థము చెప్పుకొనవలెను. ఇట్లే పరిమాణమాత్రే అనుచోట కూడా ప్రాతిపదికార్థముతోపాటు పరిమాణము మాత్రమే అధికముగా భాసించునపుడు అని అర్థము చెప్ప వలెను. వచనమనగా సంఖ్య. ఇక నీ సూత్రమునకీ విధముగ అర్థము

చెప్పవచ్చును. ప్రాతిపదికార్థముపైన కేవలము ప్రాతిపదికార్థమునందును లింగము మాత్రమే అధికముగా భాసించునపుడును, పరిమాణము మాత్రమే అధికముగా భాసించునపుడును, సంఖ్యామాత్రమునను ప్రథమా విభక్తి వచ్చును.

ప్రాతిపదికార్థ మాత్రమున ప్రథమ వచ్చుననుచోట ప్రాతిపదికార్థ మనగా నేమో 'నియతోపస్థితికః ప్రాతిపదికార్థః' అను వృత్తివాక్యము నిర్వచించుచున్నది. ప్రాతిపదికమును వినగనే నియతముగా ఏ అర్థము స్ఫురించునో అది ప్రాతిపదికార్థము.

ప్రాతిపదికను వినగనే జాతి (ప్రవృత్తినిమిత్తము), వ్యక్తి (వ్యక్తి, ప్రవృత్తినిమిత్తము), లింగము, సంఖ్య, కారకము అను నీ ఐదర్థములు స్ఫురించుటచే నివి ప్రాతిపదికార్థములైను ఈ విషయమున మతభేదములు కన్పించుచున్నవి. జాతి, వ్యక్తులు రెండు ప్రాతిపదికార్థమని ఒక మతము. జాతి, వ్యక్తి లింగములు మూడు ప్రాతిపదికార్థమని రెండవ మతము. జాతి, వ్యక్తి, లింగ, వచనములు ప్రాతిపదికార్థమని మూడవ మతము. జాతి, వ్యక్తి, లింగ, వచన, కారకములైదును ప్రాతిపదికార్థమని నాలుగవ మతము. మొదటి నాలుగింటిలో ప్రాతిపదికార్థములుగ భావింపబడుతున్న వాటికంటె భిన్నములైన అర్థములు ప్రత్యయార్థములుగా గ్రహించవలెను.

జాతి, వ్యక్తి — ఈ రెండు ప్రాతిపదికార్థములను మొదటిపక్షమున తప్ప తక్కిన పక్షములన్నింటియందును లింగము కూడ ప్రాతిపదికార్థముగ పరిగణింపబడుటచే సూత్రమున ప్రత్యేకముగ "లింగ" శబ్దమును గ్రహించుట వ్యర్థమగును కదా! అని యాశంక కలుగవచ్చును. కనుక ఇట ప్రాతిపదికార్థమనగా ప్రాతిపదికము నుచ్చరింపగనే నియతముగ

స్ఫురించు జాతి, వ్యక్తి రూపార్థములనియే తాత్పర్యము. తటః, తటీ, తటమ్ మున్నగు అనియతలింగముల స్థలమున నియతముగ నొక లింగము స్ఫురింపకపోవుటచే ప్రాతిపదికార్థశబ్దముచే నివి గ్రహింపబడక "ప్రాతిపదికార్థమాత్రే ప్రథమా" అను సూత్రాంశముచే నిట ప్రథమా విభక్తి రాకుండును. కనుకనే సూత్రమున లింగశబ్దము ఆవశ్యకము. లింగము భాసింపని ఉచ్చైస్, నీచైస్ మున్నగునవియు, నియతలింగము లగు కృష్ణ, శ్రీ మున్నగు శబ్దములును "ప్రాతిపదికార్థమాత్రే ప్రథమా" అను అంశమున కుదాహరణములగును.

ప్రాతిపదికము నుచ్చరింపగనే మొదట స్ఫురించునవి జాతి, వ్యక్తి రూప-అర్థములు. లింగముకాని, పరిమాణముకాని జాతి, వ్యక్తి రూపార్థ ములు స్ఫురించిన పిమ్మటనే స్ఫురించును. కాని లింగ, పరిమాణార్థములకు ప్రాతిపదికార్థముతోగాక స్వతంత్రముగా స్ఫురించు శక్తి లేదు. కనుకనే 'లింగమాత్రే, పరిమాణమాత్రే ప్రథమా' అని చెప్పుట కుదరదు. కనుక 'లింగమాత్రాధిక్యే, పరిమాణమాత్రాధిక్యే ప్రథమా' అని చెప్పవలెను. అందుకే ప్రాతిపదికార్థముతోపాటు లింగముకాని, పరిమాణముకాని అధిక ముగ భాసించినను ప్రథమ వచ్చునని భావము.

వృ: ఉచ్చైః; నీచైః; కృష్ణః; శ్రీః; జ్ఞానమ్.

ఈ ఐదింటిలో ఉచ్చైస్, నీచైస్ అనునవి లింగము భాసింపని అవ్యయములు. కృష్ణ, శ్రీ, జ్ఞాన అనునవి నియతలింగములగు శబ్దములు. కనుక వీనిపై (అలింగములు, అనియత లింగములు అగు శబ్దములు) "ప్రాతిపదికార్థమాత్రే ప్రథమా" అను సూత్రాంశముచే ప్రథమావిభక్తి ప్రత్యయములు వచ్చును. ఉచ్చైస్, నీచైస్ ఇత్యాద్యవ్యయములపై వచ్చు ప్రథమావిభక్తి "అవ్యయాదాప్సుపః" అను సూత్రముచే లోపించి

కేవలము ప్రాతిపదికమే శేషించినను వానికి పదత్వ సిద్ధికై సుప్పును చేర్చుట ఆవశ్యకము.

తటః, తటీ, తటమ్ :- ఇట ప్రాతిపదికార్థముతో పాటు పుంస్త్వాది లింగములుగూడ అధికముగ భాసించుచున్నవి. ఇవి లింగ మాత్రాధిక్యమునను ప్రథమావిభక్తి వచ్చుటకుదాహరణములు.

ద్రోణః వ్రీహిః[1] - ఇది 'పరిమాణ మాత్రాధిక్యే ప్రథమా' అనుదానికి ఉదాహరణము. ద్రోణ శబ్దమునకు పరిమాణ విశేషము అర్థము. దీనిపై ఈ సూత్రముచే వచ్చు ప్రథమావిభక్తికి పరిమాణ సామాన్య మర్థము. 'ద్రోణ' యను ప్రాతిపది కార్థమగు పరిమాణ విశేషమునకు, ప్రథమా విభక్త్యర్థమగు పరిమాణసామాన్యమునకును అభేదాన్వయముచే ద్రోణాభిన్న పరిమాణమను అర్థము వచ్చును. తరువాత "ద్రోణో వ్రీహిః" అను చోట ప్రత్యయార్థమగు పరిమాణ సామాన్యమునకు వ్రీహిశబ్దముతో పరిచ్ఛేద్య పరిచ్ఛేదక సంబంధముతో అన్వయము పరిచ్ఛేద్యమనగా కొలువదగినది. పరిచ్ఛేదకమనగా కొలుచునట్టిది. ఇట పరిచ్ఛేద్యము వ్రీహి. పరిచ్ఛేదకము ద్రోణము. కనుక ద్రోణో వ్రీహిః అనుచోట ద్రోణరూపపరిమాణముచే పరిచ్ఛిన్నమగు వ్రీహి అను బోధ కలుగును.

ఏకః, ద్వౌ, బహవః - అను సంఖ్యావాచక పదములు 'వచన మాత్రే ప్రథమా' అను అంశమునకు ఉదాహరణములు. అనగా నిట వచ్చిన ప్రథమావిభక్త్యర్థప్రత్యయములు క్రమముగా ఏకత్వ, ద్విత్వ, బహుత్వ రూపార్థములను తెలుపుచున్నవి. కాని ఇట ఏక, ద్వి, బహు అను ప్రాతిపదికములే ప్రత్యయార్థముల - ఏకత్వ, ద్విత్వ, బహుత్వము

---

1. తూము లేక నల్దుము ధాన్యము.

లను వచనము (సంఖ్య) లను తెలుపుటచే 'ఉక్తార్థానామప్రయోగః' అను న్యాయముచే తిరిగి ఏకత్వాది బోధకములగు ప్రత్యయములు వచ్చుటకు వీలులేదు. విభక్తిప్రత్యయములు రానిచో ఏక, ద్వి ఇత్యాదులకు పదత్వము సిద్ధింపదు. కావున ఏకత్వాది సంఖ్యాబోధకములగు ఏక, ద్వి., బహు అను శబ్దములపై ప్రథమావిభక్తిప్రత్యయములు వచ్చుటచే సూత్రమున 'వచన' శబ్దము చెప్పబడినది. ఇట ప్రకృతి ప్రత్యయములు రెండింటికి సంఖ్యాబోధకత్వమే ఉన్నను ప్రత్యయములు ప్రకృత్యర్థమగు ఏకత్వాదికమును కేవలము అనువదించునని తాత్పర్యము.

సూ : సంబోధనే చ 2-3-47

సంబోధనమనగా ఎదుటనున్న వానిని పిలుచుట. అట్టి యర్థమునను ప్రథమావిభక్తి వచ్చును.

హే రామః ఇట సంబోధనార్థమున రామశబ్దముపై ఈ సూత్రముచే ప్రథమైకవచనము. 'ఏఙ్హ్రస్వాత్సంబుద్ధేః' అను సూత్రముచే సంబోధన ప్రథమైకవచనమునకు లోపము రాగా 'రామ' అని యగును.

సూ : కర్తురీప్సితతమం కర్మ 1-4-49

వృ : కర్తుః క్రియయా ఆప్తుమిష్టతమం కారకం కర్మసంజ్ఞం స్యాత్.

కర్తకు స్వక్రియచే ఏది ఈప్సితతమమో ఆ కారకము కర్మ సంజ్ఞకమగును, ధాతువునకు ఫలము, వ్యాపారము అని రెండర్థము లుండును. దానిలో వ్యాపారమున కాశ్రయమైనవాడు కర్త. ఆప్తుం ఇష్టం ఈప్సితమ్, అతిశయేన ఈప్సితమ్, ఈప్సితతమమ్. అనగా పొందుటకై ఎక్కువగా అభిలషింపబడినదని భావము. దేనిద్వారా పొందుట? అను

ఆకాంక్ష కలిగినపుడు కర్త యందలి "వ్యాపారము ద్వారా" అని అర్థాత్ లభించును. కనుక కర్తయందున్న వ్యాపారముచే ప్రయోజ్యమగు ఫలముతో దేనికి సంబంధములను కల్పించుటకై ఇష్టపడునో అది కర్మ సంజ్ఞకమని సూత్రార్థము. 'తండులాన్ పచతి' అనుచోట పచ్ ధాతువునకు విక్లిత్త్యనుకూలవ్యాపారమర్థము. తండులము ఉడికి మెత్తబడుటను విక్లిత్తి అని యందురు. (ఇది తండులములందుండును) గిన్నె పొయ్యిపై ఉంచుట, నీళ్ళు పోయుట, మంట పెట్టుట మొదలగు కార్య సంభారము విక్లిత్త్యనుకూలవ్యాపారము. (ఇది కర్తయందుండును.) ఈ వ్యాపారముచే ప్రయోజ్యమగు ఫలము విక్లిత్తిరూపఫలము. అట్టి ఫలముతో సంబంధముగలవి తండులములు. కనుక తండుల శబ్దమునకి సూత్రముచే. కర్మసంజ్ఞ.

క్రియను జనింపజేయునది (కరోతీతి కారకమ్ అని వ్యుత్పత్తి) లేదా క్రియయందు అన్వయించునది కారకమనబడును. "కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము" అని కారకము లారు.[1]

**సూ. కర్మణి ద్వితీయా 2-3-2**

వృ : అనుక్తే కర్మణి ద్వితీయా స్యాత్. హరిం భజతి

కర్మ తిఙాదులచే చెప్పబడనపుడు ప్రాతిపదికముపై ద్వితీయా విభక్తి వచ్చును.

---

1. కర్తా కర్మ చ కరణం సంప్రదానం తథైవ చ
అపాదానాధికరణే ఇత్యాహుః కారకాణి షట్.

హరిం భజతి :- (హరిని భజించుచున్నాడు) భజ్ ధాతువునకు సంతుష్ట్యనుకూల పూజాది వ్యాపారమర్థము. కర్తయందున్న పూజాది వ్యాపారమునకు ప్రయోజ్యమగు సంతుష్టిరూపమగు ఫలము హరియందుండుటచే పూర్వ సూత్రముచే హరి శబ్దమునకు కర్మత్వము. భజతి అనుచోట తిఙ్ప్రత్యయము కర్తను మాత్రమే చెప్పును. కాని కర్మను చెప్పుటలేదు. కనుక కర్మ అనభిహితమగుటచే కర్మ సంజ్ఞకమగు హరి శబ్దముపై ఈ సూత్రముచే ద్వితీయావిభక్తి రాగా 'హరిమ్' అని యగును.

వృ :- అభిహితే తు కర్మాదౌ ప్రథమా; హరిః సేవ్యతే; లక్ష్మ్యా సేవితః.

కర్మ అభిహితమైనపుడు మాత్రము ప్రథమా విభక్తియే వచ్చును. కర్మ సాధారణముగ తిఙ్, కృత్, తద్ధితములచే చెప్పబడుచుండును. ఉదా : హరిః సేవ్యతే (హరి సేవింపబడుచున్నాడు) అనుచోట కర్మార్థకమగు 'సేవ్యతే' అను తిఙంతముచే కర్మయగు హరి చెప్పబడుటచే హరి శబ్దమునకు కర్మ సంజ్ఞ ఉన్నను దానిపై ద్వితీయావిభక్తి రాదు. "ప్రాతిపదికార్థ...." అను సూత్రముచే ప్రథమయే వచ్చును. 'లక్ష్మ్యా హరిః సేవితః' అనుచోట కర్మార్థక కృత్ప్రత్యయాంతమగు 'సేవిత' శబ్దముచే కర్మయగు 'హరి' చెప్పబడుటచే హరి శబ్దముపై ద్వితీయ రాక ప్రథమయే వచ్చును. శత్యః (శతేన క్రీతః) పటః అనుచోట తద్ధిత ప్రత్యయమగు యత్ ప్రత్యయము చేతను, ప్రాప్తానందః దేవదత్తః (ప్రాప్తః ఆనందః యం సః) అనుచోట సమాసము చేతను కర్మ చెప్పబడుటచే క్రమముగా పట, దేవదత్త శబ్దములపై ప్రకృత సూత్రముచే ద్వితీయ రాదు. ప్రథమావిభక్తియే వచ్చును.

**సూ :- అకథితం చ 1-4-51 :**

వృ :- అపాదానాది విశేషైరవివక్షితం కారకం కర్మ సంజ్ఞం స్యాత్.

దుహ్యాచ్ పచ్ దండ్ రుధి ప్రచ్ఛిచి బ్రూశాసుజిమథ్ ముషామ్.
కర్మయుక్ స్యాదకథితం తథా స్యాన్నీహృకృష్వహామ్.

అపాదానము, సంప్రదానము, అధికరణము మున్నగు విశేషములచే అకథిత (అవివక్షిత) మగు కారకము కూడ కర్మ సంజ్ఞకమగును. అపాదానత్వాదులును ఆయా విశేష రూపమునకాక సామాన్య సంబంధ మాత్రముగ వివక్షితములైనపుడు ఆయా కారకములు కర్మ సంజ్ఞకము లగునని భావము. అపాదానాదులుగనే వివక్షించినచో మాత్రము వానికి కర్మసంజ్ఞ రాక అపాదానాది సంజ్ఞలే వచ్చును.

ఏయే ధాతువుల ప్రయోగమున అపాదానాదులు అపాదానాదులుగ వివక్షింపబడవో అట్టి పదునారు ధాతువులను వార్తికకారులు పరిగణన చేసినారు. ఆ ధాతువులే 'దుహ్యాచ్' అను పై శ్లోకమున సంగ్రహింపబడినవి.

ఆ ధాతువులు వాని యర్థములతో క్రింద చూపబడుచున్నవి.

1. దుహ్ (పితుకుట), 2. యాచ్ (యాచించుట), 3. పచ్ (వండుట) 4. దండ్ (శిక్షించుట), 5. రుధ్ (అడ్డుపెట్టుట), 6. ప్రచ్ఛ్ (అడుగుట), 7. చి (ఏరుట), 8. బ్రూ (పలుకుట), 9. శాస్ (అనుశాసించుట), 10. జి (జయించుట), 11. మథ్ (చిలుకుట), 12. ముష్ (దొంగిలించుట), 13. నీ (తీసికొని పోవుట), 14. హృ (తీసికొనుట), 15. కృష్ (గుంజుట, దున్నుట), 16. వహ్ (తీసికొనిపోవుట),

ఈ పదునారు ధాతువుల కర్మతో ఏ అపాదానాదికము సంబంధించునో అది అకథిత (అవివక్షిత) కర్మ యగునని పై శ్లోకభావము.

గాం దోగ్ధి పయః : ఇచట గోవు అపాదానము. కాని యిట గోవు నందలి అపాదానత్వము అవివక్షితమగుటచే ప్రకృత సూత్రముచే అపాదాన మగు గోశబ్దమునకు కర్మ సంజ్ఞ రాగా 'కర్మణి ద్వితీయా' అను సూత్ర ముచే ద్వితీయ వచ్చి 'గామ్' అను రూపమేర్పడును. గోవు నందలి అపా దానత్వమును వివక్షించినపక్షమున 'అపాదానే పంచమీ' అను తరువాతి సూత్రముచే గోశబ్దముపై పంచమీవిభక్తి వచ్చి 'గోః పయః దోగ్ధి' అని అగును.

బలిం యాచతే వసుధామ్ : (బలినుండి భూమిని యాచించు చున్నాడు) ఇట బలియందలి అపాదానత్వము అవివక్షితమగుటచే ప్రకృత సూత్రముచే బలిశబ్దమునకు కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

తండులాన్ ఓదనం పచతి : (బియ్యముతో అన్నము వండుచు న్నాడు.) ఇట తండులములయందలి కరణత్వము అవివక్షితమగుటచే ప్రకృతసూత్రముచే తండుల శబ్దమునకు కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

గర్గాన్ శతం దండయతి : (గర్గులనుండి నూరు నాణెములను గ్రహించుచున్నాడు.) ఇచట గర్గులయందలి అపాదానత్వ మవివక్షితమగు టచే గర్గ శబ్దమునకు సూత్రముచే కర్మసంజ్ఞరాగా ద్వితీయ వచ్చినది.

వ్రజం అవరుణద్ధి గామ్ : (పశువుల కొట్టములో గోవును నిరో ధించుచున్నాడు.) ఇట వ్రజము నందలి అధికరణత్వ మవివక్షితమగుటచే వ్రజ శబ్దమునకి సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

మాణవకం పంథానం పృచ్ఛతిః (మాణవకునిచే మార్గమును తెలిసికోదలచుచున్నాడు.) ఇట మాణవకుని యందలి కరణత్వమవివక్షిత మగుటచే మాణవకశబ్దమునకు ఈ సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

వృక్షమ్ అవచినోతి ఫలాని : (వృక్షమునుండి ఫలములను తెంపి వేయుచున్నాడు.) ఇట వృక్షమునందలి అపాదానత్వము అవివక్షితమగుటచే వృక్షశబ్దమునకి సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

మావణకం ధర్మం బ్రూతే, శాస్తి : (మాణవకునికొఱకు ధర్మమును చెప్పుచున్నాడు) ఇట మాణవకునియందలి సంప్రదానత్వము అవివక్షిత మగుటచే మాణవక శబ్దమునకి సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

శతం జయతి దేవదత్తమ్ : (దేవదత్తునినుండి వంద నాణెములను గెలుచుచున్నాడు.) ఇచట దేవదత్త శబ్దమునకు కర్మసంజ్ఞ రాగా దేవదత్తుని యందలి కర్మత్వమవివక్షితమగుటచే పై సూత్రముచే ద్వితీయ వచ్చినది

సుధాం క్షీరనిధిం మథ్నాతి: (పాలసముద్రమునుండి అమృతమును చిలుకుచున్నాడు.) ఇట క్షీరనిధి యందలి అపాదానత్వ మవివక్షితమగుటచే క్షీరనిధి శబ్దమునకు ఈ సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

దేవదత్తం శతం ముష్ణాతి: (దేవదత్తునినుండి వంద నాణెములు దొంగిలించుచున్నాడు) ఇట దేవదత్తునియందలి అపాదానత్వ మవివక్షిత మగుటచే దేవదత్తశబ్దమునకు ఈ సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

గ్రామం అజాం నయతి. (ఆడుమేకను గ్రామములోనికి తీసికొని పోవుచున్నాడు.) ఇచట గ్రామమందున్న అధికరణత్వమ వివక్షితమగుటచే గ్రామ శబ్దమునకు ఈ సూత్రముచే కర్మసంజ్ఞ రాగా ద్వితీయ వచ్చినది.

ఇట్లే హరతి, కర్షతి, వహతి అను క్రియల ప్రయోగమందును గ్రామమందలి యధికరణత్వము అవివక్షిత మగుటచే గ్రామ శబ్దమునకు కర్మసంజ్ఞయు తద్ద్వారా ద్వితీయయు వచ్చును.

వృ : అర్థనిబంధనేయం సంజ్ఞా; బలిం భిక్షతే వసుధామ్; మాణ వకం ధర్మం అభిధత్తే - వక్తీత్యాది.

దుహ్, యాచ్ అను పదునారు ధాతువులే కాక వాని యర్థములు గల పర్యాయ ధాతువులను ప్రయోగించినను అపాదానత్వాదులు అవివక్షిత మైనచో కర్మసంజ్ఞ వచ్చునని గ్రహించవలెను. కనుక బలిం భిక్షతే వసు ధామ్ అను ఉదాహరణమున యాచ్ ధాత్వర్థముగల భిక్ష ధాతువు ప్రయోగింపబడినను బలియందలి అపాదానత్వము అవివక్షితమగుటచే బలి శబ్దమునకు కర్మసంజ్ఞ. ఇట్లే 'మాణవకం ధర్మం భాషతే, అభిధత్తే' అను ఉదాహరణమున బ్రూఞ్ ధాత్వర్థకములగు భాష్, అభిధా అను ధాతువులు ప్రయోగింపబడినవి కనుక మాణవకుని యందలి అపాదానత్వమువివక్షితమగుటచే మాణవకశబ్దమునకు కర్మసంజ్ఞ.

**సూ: స్వతంత్రః కర్తా 1-4-54**

వృ : క్రియా యాం స్వతంత్రేణ వివక్షితోఽర్థః కర్తా స్యాత్.

క్రియయందు స్వతంత్రముగ (ప్రధానముగ) వివక్షింపబడు అర్థము కర్తృ సంజ్ఞకమగును. పాచకః పచతి (వంటవాడు వండుచున్నాడు) అను చోట పాకక్రియయందు స్వతంత్రముగా (ప్రధానముగా) వివక్షింపబడిన వాడు పాచకుడగుటచే పాచకుడు కర్త.

**సూ : సాధకతమం కరణమ్ 1-4-42**

వృ : క్రియాసిద్ధౌ ప్రకృష్టోప కారకం కరణసంజ్ఞం స్యాత్. క్రియా సిద్ధి యందు ఎక్కువగ ఉపకరించు సాధనము కరణ సంజ్ఞక మగును.

బాణేన హతో వాలీ : (బాణముచే వాలి చంపబడినాడు) అనుచోట హనన క్రియయందు ఎక్కువగ ఉపకరించిన సాధనము బాణమగుటచే అధికరణము.

సూ : కర్తృకరణయో స్తృతీయా 2-3-18

వృ : అనభిహితే కర్తరి కరణే చ తృతీయా స్యాత్; రామేణ బాణేన హతో వాలీ.

కర్త మరియు కరణము అనభిహితము లైనపుడు కర్తృ సంజ్ఞకముపైనను, కరణసంజ్ఞకముపైనను తృతీయావిభక్తి వచ్చును.

రామేణ బాణేన హతో వాలీ: (రామునిచే బాణముచే వాలి చంపబడినాడు) ఇట హనన క్రియ యందు ప్రధాన సాధనమగుటచే బాణము కరణము. హతః అను పదమందలి కర్మార్థక 'క్త' ప్రత్యయముచే వాలి అభిహితు డగుచున్నాడు. కర్తృ కరణములగు రామబాణ శబ్దములపై ఈ సూత్రముచే తృతీయావిభక్తి రాగా రామేణ, బాణేన అను రూపము లేర్పడును.

సూ : కర్మణా యమభిప్రైతి స సంప్రదానమ్ 1-4-32

వృ : దానస్య కర్మణా యమభిప్రైతి స సంప్రదానసంజ్ఞః స్యాత్

దానక్రియలో కర్మయగు 'గోవు' మొ॥ వానిచే కర్త దేనిని శేషి (భోక్త)గా ఉద్దేశించునో అది సంప్రదానమనబడును. దేనిని ఉద్దేశించి ఒక వస్తువు ఈయబడునో అది సంప్రదానమని భావము.

విప్రాయ గాం దదాతి (బ్రాహ్మణునికి గోవును ఇచ్చుచున్నాడు.) ఇచ్చట దానక్రియలో గోవు కర్మ. కర్మయగు గోవు విప్రు నుద్దేశించి ఈయబడుచున్నది కనుక విప్రుడు సంప్రదానము.

సూ : చతుర్థీ సంప్రదానే 2-3-13

వృ : విప్రాయ గాం దదాతి.

సంప్రదానార్థమున సంప్రదాన సంజ్ఞకమగు శబ్దముపై చతుర్థీ విభక్తి వచ్చును.

'విప్రాయ గాం దదాతి' అనుచోట సంప్రదానసంజ్ఞకమగు విప్ర శబ్దముపై ఈ సూత్రముచే చతుర్థీ విభక్తి రాగా 'విప్రాయ' అని యగును.

సూ : నమః- స్వస్తి- స్వాహా- స్వధా- లం- వష- డ్యోగాచ్చ 2-3-16

వృ : ఏభిర్యోగే చతుర్థీ; హరయే నమః- ప్రజాభ్యః స్వస్తి- అగ్నయే స్వాహా- పితృభ్యః స్వధా- అలమితి పర్యాప్త్యర్థ గ్రహణమ్. తేన దైత్యేభ్యో హరిరలమ్ - ప్రభుః సమర్థః శక్త ఇత్యాది.

నమస్, స్వస్తి, స్వాహా, స్వధా, అలం, వషట్ అను శబ్దముల యోగమున్నపుడును వీని సంబంధముగల శబ్దముపై ద్వితీయ వచ్చును.

హరయే నమః (విష్ణువునకు నమస్కారము) ఇట నమః శబ్దయోగ ముండుటచే హరి శబ్దముపై చతుర్థీవిభక్తి వచ్చినది.

ప్రజాభ్యః స్వస్తి (ప్రజలకు క్షేమమగుగాక) అగ్నయే స్వాహా (అగ్నికి సమర్పించుచున్నాను.) పితృభ్యః స్వధా (పితృ దేవతలకు సమర్పించుచున్నాను) అను ఈ ఉదాహరణములలో క్రమముగా స్వస్తి, స్వాహా, స్వధా అను శబ్దముల సంయోగ ముండుటచే ప్రజా, అగ్ని, పితృ అను శబ్దములపై చతుర్థీవిభక్తి వచ్చినది.

వృ :- అలమితి పర్యాప్త్యర్థ గ్రహణమ్. తేన దైత్యేభ్యో హరిరలం, ప్రభుః, సమర్థః శక్త ఇత్యాది.

సూత్రమందలి 'అలమ్' అను శబ్దము పర్యాప్త్యర్థకము కనుక 'అలం' శబ్దపర్యాయములతో యోగమున్నను చతుర్థి వచ్చును. కనుక దైత్యేభ్యః హరిః అలమ్ అనుచోట అలంశబ్ద యోగముండుటచేతను, దైత్యేభ్యః హరిః ప్రభుః, దైత్యేభ్యః హరిః సమర్థః; దైత్యేభ్యః హరిః

శక్తః ఇత్యాదిస్థలములలో పర్యాప్త్యర్థక-అలంశబ్దపర్యాయములతో యోగ ముండుటచేత దైత్య శబ్దముపై చతుర్థీవిభక్తి వచ్చినది. ఇట్లే 'వషట్ ఇంద్రాయ' ఇత్యాది స్థలములలో వషట్‌శబ్దయోగముండుటచే 'ఇంద్ర' శబ్దముపై తృతీయావిభక్తి వచ్చినది.

సూ :- ధ్రువమపాయేఽపాదానమ్ 1-4-24

వృ. అపాయో విశ్లేషస్తస్మిన్సాధ్యే యత్ ధ్రువ మవధి భూతం కారకం తదపాదానం స్యాత్.

అపాయమనగా విశ్లేషము. (విడివడుట.) ధ్రువమనగా అవధి. ఏదేని ఒక వస్తువు నుండి మరొక వస్తువు విడివడుచున్నదని చెప్పి నప్పుడు ఆ విశ్లేషమున కవధి యగు వస్తువు అపాదానసంజ్ఞక మగును.

వృక్షాత్ పర్ణం పతతి : (వృక్షమునుండి ఆకు పడుచున్నది) ఇచట విడివడుచున్న ఆకునకు అవధియైనది వృక్షమగుటచే వృక్ష శబ్దమునకు ఈ సూత్రముచే సంప్రదాన సంజ్ఞ, తరువాతి సూత్రముచే పంచమీ విభక్తియు వచ్చినవి.

సూ :- అపాదానే పంచమీ 2-3-28

వృ: గ్రామాదాయాతి, ధావతోఽశ్వాత్పతతీత్యాది.

అపాదానార్థమున అపాదాన సంజ్ఞకమగు శబ్దముపై పంచమీ విభక్తి వచ్చును.

గ్రామాత్ ఆయాతి : (గ్రామము నుండి వచ్చుచున్నాడు.) గ్రామములో నున్నవాడు గ్రామమును వదలి వచ్చుచున్నాడు అని భావము. ఇచట విశ్లేషమున కవధియైనది గ్రామ మగుటచే గ్రామ శబ్దము నకు పూర్వ సూత్రముచే అపాదానసంజ్ఞయు, ఈ సూత్రముచే పంచమీ విభక్తియు రాగా 'గ్రామాత్' అని అగును.

ధావతోఽ శ్వాత్ పతతి : (పరుగెత్తుచున్న అశ్వము నుండి పడుచున్నాడు) ప్రకృత సూత్రమునందలి ధ్రువ శబ్దమునకు అవధి యని అర్థమే కాని స్థిరమైనదని యర్థము కాదు. కనుక పతనావధియైన అశ్వ శబ్దమునకు అపాదానసంజ్ఞ రాగా ఈ సూత్రముచే పంచమీవిభక్తి వచ్చినది. స్థిరమైనదని యర్థము చెప్పినచో పరుగెత్తెడి అశ్వము స్థిరము కాదు కనుక నిట అశ్వ శబ్దమునకు అపాదానసంజ్ఞ రాకుండెడిది.

సూ: షష్ఠీ శేషే 2-3-50

వృ: కారకప్రాతిపదికార్థవ్యతిరిక్తః స్వస్వామిభావాదిః సంబంధః శేషస్తత్ర షష్ఠీ, రాజ్ఞః పురుషః; కర్మాదీనామపి సంబంధమాత్రవివక్షాయాం షష్ఠ్యేవ; సతామ్ గతమ్ సర్పిషో జానీతే; మాతుః స్మరతి, ఏధోదకస్యోపస్కురుతే, భజే శంభోశ్చరణయోః.

శేషశబ్దమునకు మిగిలిన అని అర్థము. ఉక్తాదన్యః శేషః అను వచనముచే ఇంతవరకు చెప్పబడిన కర్త, కర్మ మున్నగు కారకముల కంటెను, ప్రాతిపదికార్థముకంటెను భిన్నమగు స్వస్వామిభావము, జన్యజనకభావము మున్నగు నర్థములలో షష్ఠీ విభక్తి వచ్చును. స్వామికిని, భృత్యునకును ఉండు సంబంధము స్వస్వామిభావసంబంధము. పితాపుత్రులకుండు సంబంధము జన్యజనకభావసంబంధము. ఇట్టి సంబంధములన్నిటను విశేషణవాచకములపై షష్ఠీవిభక్తి వచ్చునని సూత్రార్థము.

రాజ్ఞః పురుషః: (రాజుయొక్క పురుషుడు.) ఇట రాజునకును, పురుషునకును స్వస్వామిభావసంబంధముండుటచే విశేషణమగు రాజన్ శబ్దముపై ఈ సూత్రముచే షష్ఠీవిభక్తి వచ్చినది.

వృ: కర్మాదీనామపి సంబంధమాత్రవివక్షాయాం షష్ఠ్యేవ. సతాం గతమ్, సర్పిషో జానీతే, మాతుః స్మరతి, ఏధోదకస్యోపస్కురుతే, భజే శంభోశ్చరణయోః.

కర్మ మున్నగు కారకములకును సంబంధమును మాత్రమే వివక్షించినచో షష్ఠీవిభక్తియే వచ్చును.

సతాం గతమ్ : (సత్పురుషసంబంధమైన గమనము.) ఇచట గమన క్రియ యందు సత్పురుషులు కర్త కావున కర్తృవాచకమగు 'సత్' శబ్దముపై "కర్తృకరణయోస్తృతీయా" అను సూత్రముచే తృతీయ రావలసియున్నది. కాని ఇట కర్తృత్వ సంబంధమును వివక్షింపక సంబంధ సామాన్యమును వివక్షించుటచే షష్ఠియే వచ్చినది కర్తృత్వ సంబంధమును వివక్షించినచో తృతీయయే వచ్చి 'సద్భిః గతమ్' అని యగును.

సర్పిషో జానీతే : సర్పిస్సు - (నెయ్యి) అను సాధనముతో ప్రవర్తించుచున్నాడు. ఇట ప్రవృత్తిరూపక్రియలో సర్పిస్సు సాధనము కాన కరణ సంజ్ఞకమగుటచే దానిపై తృతీయ రావలసియున్నది. కాని సంబంధ సామాన్యమునే వివక్షించుటచే షష్ఠియే వచ్చి 'సర్పిషః' అని యగును. కరణత్వ రూప సంబంధమును వివక్షించినపుడు మాత్రము తృతీయ వచ్చి 'సర్పిషో జానీతే' అని యగును.

మాతుః స్మరతి : (మాతృ సంబంధమైన స్మరణ చేయుచున్నాడు.) ఇట స్మరణ క్రియలో మాతృ శబ్దము కర్మయైనను కర్మత్వ రూపసంబంధమును కాక సంబంధసామాన్యమునే వివక్షించుటచే షష్ఠియే వచ్చినది. కర్మత్వరూప సంబంధమును వివక్షించినచో 'మాతరం స్మరతి' అని ద్వితీయయు వచ్చును.

భజే శంభోశ్చరణయోః : (శంకరుని చరణ సంబంధమైన నమస్కారము చేయుచున్నాడు.) ఇచట చరణములకర్మత్వ రూప సంబంధమును వివక్షింపక సంబంధ సామాన్యమునే వివక్షించుటచే చరణ శబ్దముపై షష్ఠి వచ్చినది. కర్మత్వ రూప సంబంధమును వివక్షించినచో ద్వితీయ వచ్చును.

సూ : ఆధారోఽధికరణమ్ 1-4-45

వృ : కర్తృకర్మద్వారా తన్నిష్ఠ క్రియాయా ఆధారః కారకమధి కరణం స్యాత్.

కర్తృకర్మల ద్వారా కర్తృకర్మల యందున్న క్రియకు ఆధార మైన కారకము అధికరణమనబడును.

కర్తృకర్మలకే సాక్షాత్తుగ ఆధారముండును కాని క్రియకు ఆధార ముండదు. కర్తృకర్మలద్వారానే క్రియకు ఆధారముండును. కర్తృ, కర్మలు ఆధారమునందుండుటచే తద్ద్వారా కర్తృకర్మల యందున్న క్రియ కూడ ఆధారమునందుండునని భావము. కనుక కర్తృకర్మలద్వారా క్రియకు ఆధారమైన కారకము (క్రియాన్వయము గలది) అధికరణమనబడును.

కటే ఆస్తే: (చాపపై కూర్చుంటున్నాడు.) ఇట కూర్చుండుట అను క్రియకు కటము దేవదత్తాది రూపకర్త ద్వారా ఆధారమైనది. కనుక ఇట కటము అధికరణ సంజ్ఞకము. స్థాల్యాం పచతి (గిన్నెలో వండుచున్నాడు): ఇచట పాకక్రియకు స్థాలి తండుల రూపకర్మ ద్వారా ఆధారమైనది. కనుక నిట స్థాలి అధికరణసంజ్ఞకము.

సూ : సప్తమ్యధికరణే చ 2-3-36

వృ : అధికరణే సప్తమీ స్యాత్. చకారాద్దూరాంతి కార్థేభ్యః. ఔపశ్లేషికో, వైషయికోఽభివ్యాపకశ్చేత్యాధారస్త్రిధా. కటే ఆస్తే, స్థాల్యాం పచతి; మోక్షే ఇచ్ఛాస్తి. సర్వస్మిన్నాత్మాస్తి. దూరే అంతికే వా.

అధికరణార్థమున అధికరణ సంజ్ఞకమగు శబ్దముపై సప్తమీవిభక్తి వచ్చును. సూత్రము నందలి 'చ' అను పదముచే పూర్వ సూత్రమగు దూరాంతికార్థేభ్యశ్చ ద్వితీయా చ అను సూత్రమునుండి దూరాంతికార్థేభ్యః అను పదము అనువర్తించి దూరము, అంతికము (సమీపము) అను అర్థము గల పదములపైనను ఈ సూత్రముచే సప్తమి వచ్చును.

ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకము అని ఆధారము మూడు విధములు. సంయోగ సమ వాయాది సంబంధములచే ఆధారమగు నది ఔపశ్లేషికాధారము.

దేవదత్తః కటే ఆస్తే : (దేవదత్తుడు చాపపై కూర్చుంటున్నాడు.) తంతుషు పటః అస్తి (తంతువులలో వస్త్రమున్నది.) అనుచోట్ల క్రమముగా దేవదత్తునకు కటము సంయోగ సంబంధముచేతను, పటమునకు తంతువులు సమవాయ సంబంధముచేతను ఆధారములగుటచే కటము, తంతువులు ఔపశ్లేషికాధారములు.

సంయోగ సమవాయాద్యతిరిక్త సంబంధములచే ఆధారమగునది వైషయికాధారము.

మోక్షే ఇచ్ఛా అస్తి : (మోక్షమున కోరిక కలదు.) ఇట ఇచ్ఛకు మోక్షము సంయోగ సమవాయాది సంబంధముచేకాక విషయతా సంబంధముచే (మోక్ష విషయకమగు ఇచ్ఛ అను తాత్పర్యానుసారము) ఆధారమైనది కనుక మోక్షము వైషయికాధారము.

ఆధేయము ఆధారమునందలి అవయవములన్నింట వ్యాపించియున్నచో అది అభివ్యాపకాధారము.

సర్వస్మిన్నాత్మాఽస్తి : (అన్నింటియందు ఆత్మ కలదు.) అనుచోట ఆధేయమగు ఆత్మ, ఆధారమగు సర్వమున వ్యాపించియుండుటచే 'సర్వము' అభివ్యాపకాధారము. ఈ త్రివిధమగు ఆధారము అధికరణసంజ్ఞకమగుటచే ఈ సూత్రముచే సప్తమి వచ్చి - కటే, మోక్షే, సర్వస్మిన్ అను రూపము లేర్పడును.

వనస్య దూరే, అంతికే : ఇట దూర, అంతిక శబ్దములు ప్రయోగింపబడుటచే వానిపై నీ సూత్రముచే సప్తమి వచ్చినది.

విభక్త్యర్థప్రకరణము సమాప్తము.

# అథ సమాస ప్రకరణమ్

సూ : అవ్యయీభావః 2-1-5

వృ : అధికారోఽయం ప్రాక్ తత్పురుషాత్.

ఈ సూత్రము "తత్పురుషః" అను సూత్రమునకు పూర్వసూత్రమగు అనేకమన్యపదార్థే (2-1-21) అను సూత్రము వరకు అధికరించును. అనగా ఈ సూత్రము (2-1-5) నుండి అనేక మన్యపదార్థే (2-1-21) అను సూత్రమువరకు చెప్పబడిన సమాసములు అవ్యయీభావసమాసములని భావము.

సూ: అవ్యయం విభక్తి - సమీప - సమృద్ధి - వ్యృద్ధ్యర్థాభావాత్య - యా సంప్రతి - శబ్ద ప్రాదుర్భావ - పశ్చా - ద్యథా - ఽనుపూర్వ్య - యౌగపద్య - సాదృశ్య - సంపత్తి - సాక - ల్యాంత వచనేషు. 2-1-6.

వృ: విభక్త్యర్థాదిషు వర్తమానమవ్యయం సుబంతేన సహ నిత్యం సమస్యతే, సోఽవ్యయీభావః; ప్రాయేణ అవిగ్రహః నిత్య సమాసః ప్రాయేణ అస్వపద విగ్రహో వా; విభక్తౌ హరిజీ అధి ఇతి స్థితే

విభక్త్యర్థము, సమీపము, సమృద్ధి, వ్యృద్ధి (అసమృద్ధి -లేక దుర్భాగ్యము), అర్థాభావము, అత్యయము (తొలగిపోవుట) అసంప్రతి (ఇప్పుడు యుక్తము గాదు) శబ్దప్రాదుర్భావము, తరువాత, యథార్థము, (యోగ్యత, వీప్స, పదార్థా నతివృత్తి, సాదృశ్యము), సంపత్తి (కలిగియుండుట), సాకల్యము (సంపూర్తి) అంతము - అను పదునారు అర్థము లందున్న అవ్య

యము సుబంతముతో నిత్యముగ సమసించును. అట్టి సమాసము అవ్యయీభావ మనబడును.

వృ : ప్రాయేణ అవిగ్రహో నిత్య సమాసః, ప్రాయేణ అస్వపద విగ్రహో వా.

సామాన్యముగ లౌకిక విగ్రహ వాక్యము లేనిది నిత్యసమాసమన బడును. సమాసముయొక్క అర్థము లౌకికవిగ్రహ వాక్యముచేతనే బోధింప బడును. కనుక లౌకికవిగ్రహ వాక్యములేని సమాసము నిత్య సమాసమనుట పొసగదు. కనుక "ప్రాయేణ అస్వపద విగ్రహో వా" అని చెప్పబడినది. అనగా సమస్త పదమునందలి పదములకంటె భిన్నములైన పదములు ప్రయోగించిన విగ్రహవాక్యమే సమాసమున చెప్పబడునో అట్టి అస్వపద విగ్రహమగు సమాసము నిత్యసమాసము.

ఉదా : 'ఉపకృష్ణమ్', అనునది సమాసపదము. దీనికి 'కృష్ణస్య సమీపే' అని విగ్రహము. ఇట సమాసపదమున లేని 'సమీపే' అను పదము విగ్రహ వాక్యమున ఉండుటచే 'ఉపకృష్ణమ్' అనునది నిత్య సమాసము.

ఇట్లే సమసించిన రెండు పదములలో ఒక పదమును మాత్రమే గ్రహించి ఏ సమాసమున విగ్రహము చెప్పబడునో అదియు అస్వపద విగ్రహమే. అట్టి సమాసము కూడ నిత్యసమాసమే.

ఉదా : అధిహరి - దీనికి 'హరౌ' అని విగ్రహము. సమాస మందలి హరియను ఒకేపదమును గ్రహించి విగ్రహము చెప్పుటచే నిదియు నిత్యసమాసమే. అవ్యయీ భావసమాసముకూడ నిత్యసమాసమే కనుక దీనికి లౌకిక విగ్రహము చెప్పవచ్చును. హరి + ఙి + అధి అను చోట సప్తమీవిభక్త్యర్థమందున్న 'అధి' అను అవ్యయమునకు హరి + ఙి అను సప్తమ్యంతముతో ఈ సూత్రముచే సమాసము వచ్చినది.

సూ : ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్ 2-2-43

వృ : సమాసశాస్త్రే ప్రథమానిర్దిష్ట ముపసర్జనసంజ్ఞం స్యాత్.

సమాసవిధాయక సూత్రమున ప్రథమావిభక్త్యంతముచే నిర్దిష్ట మగునది ఉపసర్జనమనబడును. హరి + ఙి + అధి అనుచోట "అవ్యయం విభక్తి...." అను పూర్వసూత్రముచే సమాసము. ఈ సమాస విధాయక సూత్రమున 'అవ్యయం' అనునది ప్రథమాంతము. కనుక దీనిచే నిర్దిష్ట మైన "అధి" అను అవ్యయమునకు ఈ సూత్రముచే ఉపసర్జన సంజ్ఞ.

సూ : ఉపసర్జనం పూర్వమ్ 2-2-30

వృ : సమాసే ఉపసర్జనం ప్రాక్ప్రయోజ్యమ్. ఇత్యధేః ప్రాక్ ప్రయోగః. సుపో లుక్. ఏకదేశవికృతస్యా నన్యత్వాత్ప్రాతిపదిక సంజ్ఞాయాం స్వాద్యుత్పత్తిః. అవ్యయీభావశ్చే త్యవ్యయత్వాత్సుపో లుక్. అధిహరి.

అధిహరి (హరియందు) హరి + ఙి + అధి అను అలౌకికవిగ్రహ వాక్యమున 'అవ్యయం విభక్తి....' అను సూత్రముచే సప్తమీ విభక్త్యర్థ మగు "అధి" అను అవ్యయమునకు హరిఙి అను సుబంతముతో సమాసము. ఉపసర్జనసంజ్ఞకమగు అధిశబ్దమునకు పూర్వనిపాతము (అధి + హరి + ఙి) 'సుపో ధాతు ప్రాతిపదికయోః' అను సూత్రముచే ఙికి లోపము రాగా అధిహరి అని యగును. ఇట అధిహరి శబ్దముపై స్వాదులు రావలసి యున్నది. స్వాదులు రావలెనన్న అధిహరి శబ్దమునకు ప్రాతిపదికసంజ్ఞ అవసరము. 'కృత్తద్ధిత సమాసాశ్చ' అను సూత్రముచే.... అధిహరి + ఙి అను సముదాయమునకు విధింపబడిన ప్రాతిపదిక సంజ్ఞ 'ఙి' లోపింపగా ఏకదేశమగు అధిహరి శబ్దమునకు వచ్చుటకు వీలులేదు. ప్రాతిపదిక సంజ్ఞ రానిచో స్వాదులు రావు కదా! అను సందేహము కలుగును. కాని ఏకదేశ

వికృత మనన్యవత్ (ఒక వస్తువు ఏకదేశమున (ఒకభాగమున) వికృతిని పొందినంత మాత్రమున అన్యము కాదు) అను న్యాయముచే అధిహరి + ఙి అను సముదాయమునకున్న ప్రాతిపదికసంజ్ఞ 'ఙి' లోపించి వికృతినొందిన అధిహరి అను శబ్దమునకును ఉండుటచే అధిహరిశబ్దముపై స్వాదులు రావచ్చును. అవ్యయీ భావశ్చ (1-1-14) అను సూత్రముచే అవ్యయీ భావమునకు అవ్యయసంజ్ఞ విధింపబడుటచే 'అధిహరి' అనుదానిపై చేర్చిన 'సుప్' ప్రత్యయమునకు 'అవ్యయాదాప్సుపః' అను సూత్రముచే లోపము రాగా 'అధిహరి' అను రూప మేర్పడును.

సూ : అవ్యయీభావశ్చ 2-4-18

వృ : అయం నపుంసకం స్యాత్.

అవ్యయీభావమును నపుంసకమగును.

అధిగోపమ్ : గాం పాతీతి (గోవులను రక్షించువాడు) గోపాః అను నది ఆకారాంత గోపాశబ్దము యొక్క ప్రథమైకవచనము. గోపా + ఙి + అధి అను అలౌకిక విగ్రహ వాక్యమున సప్తమ్యర్థమగు 'అధి' అను అవ్యయమునకు గోపా + ఙి అను సుబంతముతో సమాసము. ఉపసర్జన సంజ్ఞకమగు 'అధి' శబ్దమునకు పూర్వనిపాతము (అధి + గోపా + ఙి) 'సుపో ధాతు' అను సూత్రముచే సుప్పునకు లుక్కు (అధిగోపా) ప్రాతిపదిక సంజ్ఞ. అవ్యయీభావమగుటచే ప్రకృత సూత్రముచే నపుంసకలింగము రాగా 'హ్రస్వో నపుంసకే' అను సూత్రముచే హ్రస్వము వచ్చి 'అధిగోప' అని యగును. ప్రథమైకవచనమున సుప్రత్యయమునకు అవ్యయాదాప్సుపః అను సూత్రముచే లోపము ప్రాప్తింపగా క్రింది సూత్రముచే నిషేధింపబడుచున్నది.

**సూ: నావ్యయీభావాదతోఽ మ్త్వపంచమ్యాః 3-4-83**

వృ :- అదంతాదవ్యయీభావాత్సుపో న లుక్, తస్య పంచమీం వినా అమాదేశశ్చ స్యాత్;గాః పాతీతి గోపాస్తస్మిన్నిత్యధి గోపమ్.

హ్రస్వాకారాంతమగు అవ్యయీభావముపైనున్న సుప్పునకు లుక్కు రాదు. కాని ఆ సుప్పునకు పంచమీ విభక్తి తప్ప ఇతర విభక్తులలో అమాదేశము వచ్చును. అధిగోప + సు అనుచోట అధిగోప అను అవ్యయీభావము హ్రస్వాకారాంతమగుటచే ప్రకృత సూత్రముచే సుప్పునకు లుక్కు రాక అమాదేశము వచ్చి 'అధిగోపమ్' అని యగును.

**సూ : తృతీయాసప్తమ్యోర్బహుళమ్ 2-4-84**

వృ :- అదంతా దవ్యయీభావాత్ తృతీయా సప్తమ్యోర్బహుళమమ్ భావః స్యాత్; అధిగోపమ్, అధిగోపేన, అధిగోపే వా; కృష్ణస్య సమీపమ్ ఉపకృష్ణమ్, మద్రాణాం సమృద్ధిః సుమద్రమ్; యవనానాం వ్యృద్ధిర్దుర్యవనమ్; మక్షికాణామ్ అభావో నిర్మక్షికమ్; హిమస్యాత్యయోఽతిహిమమ్; నిద్రా సంప్రతి న యుజ్యత ఇత్యతినిద్రమ్; హరిశబ్దస్య ప్రకాశ ఇతిహరి; విష్ణోః పశ్చాదనువిష్ణు - యోగ్యతా వీప్సా పదార్థానతివృత్తిసాదృశ్యాని యథార్థాః; రూపస్య యోగ్యమనురూపమ్; అర్థమర్థం ప్రతి ప్రత్యర్థమ్; శక్తి మనతిక్రమ్య యథాశక్తి.

హ్రస్వ- అకారాంతమగు అవ్యయీభావముపై నున్న తృతీయా సప్తమీవిభక్తిప్రత్యయములకు అమాదేశము బహుళముగా వచ్చును.

ఉపకృష్ణమ్ ఉపకృష్ణేన : కృష్ణస్య సమీపమ్ అని లౌకిక విగ్రహ వాక్యము. కృష్ణ + ఙస్ + ఉప అను అలౌకికవిగ్రహ వాక్యమున 'అవ్యయం విభక్తి' అను సూత్రముచే సమీపార్థకమగు ఉప అను అవ్యయ

మునకు కృష్ణ + జస్ అను సుబంతముతో సమాసము. ఉప అనునది ఉప సర్జనమగుటచే పూర్వ నిపాతము (ఉప + కృష్ణ + జస్) సుప్పునకు లోపము రాగా ఉపకృష్ణ అని యగును. తృతీయావిభక్తి ప్రత్యయము (టా) రాగా దానికి సూత్రముచే వికల్పముగ అమాదేశము. అమాదేశము వచ్చిన పక్షమున ఉపకృష్ణమ్ అనియు, అమాదేశము దానిపక్షమున ఉప కృష్ణేన అనియు రూపములు సిద్ధించును. ఇట్లే సప్తమీ విభక్తి యందును ఉపకృష్ణమ్, ఉపకృష్ణే అను రెండు రూపములు ఏర్పడును. పంచమిలో మాత్రము పూర్వసూత్రముచే అమాదేశము రాక ఉపకృష్ణాత్ అను నొకే రూపముండును.

హ్రస్వ - అకారాంతములకు అవ్యయీభావ సమాసములలో పంచమీ విభక్తిలో తప్ప అన్ని విభక్తులలోను సుప్పుకు అమాదేశము వచ్చును. తృతీయా, సప్తమీ విభక్తులలో మాత్రము అమాదేశము వైకల్పికము.

సుమద్రమ్: (మద్రదేశీయుల సమృద్ధి) మద్రాణాం సమృద్ధిః. అని లౌకిక విగ్రహ వాక్యము. మద్ర + ఆమ్ + సు అను అను అలౌకిక విగ్రహ వాక్యమున సమృద్ధ్యర్థకమగు 'సు' అను అవ్యయమునకు మద్ర + ఆమ్ అను సుబంతముతో సమాసము, తక్కిన ప్రక్రియ ఉప కృష్ణమ్ అను రూపమువలెనే.

దుర్యవనమ్ : (యవనుల వృద్ధి లేకుండుట) యవనానాం వ్యృద్ధిః అని లౌకిక విగ్రహ వాక్యము. యవన + ఆమ్ + దుర్ అను అలౌకిక విగ్రహ వాక్యమున వ్యృద్ధ్యర్థకమగు అవ్యయమునకు యవన + ఆమ్ అను సుబంతముతో సమాసము.

నిర్మక్షికమ్ : (ఈగలు లేకుండుట) మక్షి కాణాం అభావః అని లౌకిక విగ్రహ వాక్యము; మక్షికా + ఆమ్ + నిర్ అను అలౌకిక విగ్రహ వాక్యమున అభావార్థకమగు 'నిర్' అను అవ్యయమునకు మక్షికా + ఆమ్ అను సుబంతముతో 'అవ్యయం విభక్తి' అను సూత్రముచే సమాసము, పూర్వనిపాతాదులు రాగా నిర్మక్షికా అని యగును. అవ్యయీ భావశ్చ అను సూత్రముచే నిది యవ్యయీ భావ మగుటచే 'హ్రస్వో నపుంసకే....' అను సూత్రముచే హ్రస్వము రాగా నిర్మక్షిక అని యగును. తక్కిన కార్యములు ఉపకృష్ణమ్ వలెనే.

అతిహిమమ్ : (హిమము యొక్క నాశము) హిమస్య అత్యయః, హిమ + జస్ + అతి అను అలౌకిక విగ్రహ వాక్యమున అత్యయా (నాశ)ర్థకమగు అతి అను నవ్యయమునకు హిమ + జస్ అను సుబన్త ముతో సమాసము. పూర్వనిపాతాది కార్యములు యథాపూర్వముగ వచ్చి అతిహిమమ్ అని యగును.

అతినిద్రమ్ : (నిద్ర ఇప్పుడు ఉచితము కాదు) నిద్రా సంప్రతి న యుజ్యతే - నిద్రా + సు + అతి అను అలౌకిక విగ్రహ వాక్యమున అసంప్రత్యర్థక (అనుచితార్థక) మగు అతి అను అవ్యయమునకు నిద్రా + సు అను సుబంతముతో సమాసము. పూర్వ నిపాతాదులు పూర్వమువలెనే. 'అవ్యయీ భావశ్చ' అను సూత్రముచే నిది నపుంసక మగుటచే 'హ్రస్వో నపుంసకే' అను సూత్రముచే హ్రస్వము రాగా 'అతినిద్ర' అని యగును. తక్కిన ప్రక్రియ పూర్వమువలెనే.

ఇతిహరి : (హరి శబ్దముయొక్క ప్రాదుర్భావము) హరేః ప్రకాశః హరి జస్ + ఇతి అను అలౌకిక విగ్రహ వాక్యమున ప్రకాశార్థక (ప్రాదు ర్భావ) మగు 'ఇతి' అను అవ్యయమునకు హరి + జస్ అను **సుబంత**

ముతో సమాసము. పూర్వనిపాతాది కార్యములు రాగా ఇతి హరి అని. యగును. దీని ప్రక్రియ 'అధిహరి' వలెనే.

అనువిష్ణు : (విష్ణువు తరువాత) విష్ణోః పశ్చాత్; విష్ణు జస్ + అను అను అలౌకిక విగ్రహ వాక్యమున పశ్చాదర్థకమగు 'అను' అను అవ్యయమునకు విష్ణు + జస్ అను సుబంతముతో సమాసము. పూర్వనిపాతము, సులోపము రాగా 'అనువిష్ణు' అను ప్రాతిపదికము సిద్ధించును. ప్రాతిపదికముపై స్వాదులు రాగా వానికి "అవ్య యాదాప్సుపః" అను సూత్రముచే లోపము రాగా 'అనువిష్ణు' అను రూపము సిద్ధించును.

అవ్యయీభావ సమాసమును విధించు 'అవ్యయం విభక్తి' అను సూత్రమున 'యథా' శబ్దార్థకమగు అవ్యయమును సుబంతముతో సమసించునని చెప్పబడినది. యథా శబ్దమునకుగల అర్థములేవో ఈ క్రింది. వృత్తిలో తెలుపబడుచున్నవి.

వృ : యోగ్యతా, వీప్సా, పదార్థానతివృత్తి,సాదృశ్యాని యథార్థాః.

యథా అను శబ్దమునకు యోగ్యత, వీప్స, పదార్థానతి వృత్తి (పదార్థము నతిక్రమింపకుండుట), సాదృశ్యము అని నాలుగర్థములు. ఈ నాలుగర్థములు గల యథా అను అవ్యయమునకు సుబన్తముతో సమాసము వచ్చును. వీనికి క్రమముగా ఉదాహరణములు చూపబడు. చున్నవి.

అనురూపమ్ : (రూపమునకు యోగ్యమైనది) రూపస్య యోగ్యమ్. రూప + జస్ + అను అను అలౌకిక విగ్రహవాక్యమున యోగ్యార్థమగు యథాఅను అవ్యయమునకు రూప + జస్ అను సుబంతముతో సమాసము..

పూర్వనిపాతాది కార్యములు పూర్వమువలెనే వచ్చి 'అనురూపమ్' అని సిద్ధించును.

ప్రత్యర్థమ్: (ప్రతి అర్థము) అర్థం అర్థం ప్రతి. అర్థ + అమ్ + ప్రతి అను అలౌకిక విగ్రహవాక్యమున వీప్సార్థకమగు ప్రతి అను అవ్యయమునకు అర్థ + అమ్ అను సుబంతముతో సమాసము. పూర్వనిపాతాది కార్యములు రాగా ప్రత్యర్థమ్ అని యగును.

యథాశక్తి (శక్తిని అతిక్రమింపకుండ) శక్తిం అనతిక్రమ్య. శక్తి + అమ్ + యథా అను అలౌకిక విగ్రహవాక్యమున పదార్థానతివృత్త్యర్థకమగు "యథా" అను అవ్యయమునకు శక్తి + అమ్ అను సుబంతముతో సమాసము. పూర్వనిపాతాదికార్యములు యథాపూర్వముగ వచ్చి యథాశక్తి అని యగును.

**సూ: అవ్యయీభావే చాకాలే 6-3-81**

వృ : సహస్య స స్యాదవ్యయీభావేనతు కాలే; హరేః సాదృశ్యం సహరి; జ్యేష్ఠస్యానుపూర్వ్యేణేత్యనుజ్యేష్ఠమ్; చక్రేణ యుగపత్ సచక్రమ్; సదృశః సఖ్యా ససఖి; క్షత్రాణాం సంపత్తిః సక్షత్రమ్; తృణమప్యపరిత్యజ్య సతృణమత్తి; అగ్నిగ్రంథపర్యంతమధీతే సాగ్ని.

అవ్యయీభావసమాసమున 'సహ' శబ్దమునకు 'స' అను ఆదేశము వచ్చును. కాలవాచకశబ్దము పరముగానున్నచో మాత్రము రాదు.

సహరి : (హరి యొక్క సాదృశ్యము) హరేః సాదృశ్యమ్. హరి + ఙస్ + సహ అను అలౌకికవిగ్రహవాక్యమున సాదృశ్యార్థకమగు సహ అను అవ్యయమునకు హరి + ఙస్ అను సుబంతముతో సమాసము

పూర్వనిపాతాదికార్యములు రాగా సహ + హరి అని యగును. ఇది అవ్యయీభావమగుటచే నీ సూత్రముచే సహశబ్దమునకు 'స' ఆదేశము. (సహరి) పిదప సమాసమగుటచే సముదాయముపై ప్రాతిపదిక సంజ్ఞ, సుప్ ప్రత్యయము, అవ్యయ సంజ్ఞ, సుబ్లోపము రాగా 'సహరి' అని యగును. ఇది యథాశబ్దార్థమగు సాదృశ్యార్థముగల అవ్యయమునకు సుబంతముతో సమాసము.

సహ పూర్వాహ్ణమ్ అను అవ్యయీభావమున పరమందు కాలవాచక శబ్దముండుటచే సహశబ్దమునకు ఈ సూత్రముచే 'స' ఆదేశము రాదు.

అనుజ్యేష్ఠమ్ (జ్యేష్ఠక్రమముగా) జ్యేష్ఠస్య అను పూర్వేణ జ్యేష్ఠ + జస్ + అను అలౌకిక విగ్రహ వాక్యమున ఆనుపూర్వ్యార్థకమగు 'అను' అను అవ్యయమునకు జ్యేష్ఠ + జస్ అను సుబంతముతో సమాసము. తక్కిన ప్రక్రియ ఉపకృష్ణమ్ వలెనే.

సచక్రమ్ : (చక్రముతో ఒక్కసారిగా) చక్రేణ యుగపత్, చక్ర + టా + సహ అను అలౌకిక విగ్రహ వాక్యమున యౌగ పద్యార్థ మగు 'సహ' అను అవ్యయమునకు చక్ర + టా అను సుబంతముతో సమాసము. పూర్వనిపాత, సుబ్లోపములును, 'అవ్యయీభావే చాకాలే' అను సూత్రముచే 'సహ'శబ్దమునకు 'స' ఆదేశమును రాగా సచక్ర అని యగును.

ససఖి : (సఖునితో సదృశుడు) సఖ్యా సదృశః - సఖి + టా + సహ అను అలౌకిక విగ్రహవాక్యమున సదృశార్థకమగు 'సహ' శబ్దమునకు సఖి + టా అను సుబంతముతో సమాసము. సహశబ్దమునకు పూర్వ నిపాతము. సుబ్లోపము - సముదాయముపై వచ్చు సుప్ ప్రత్యయమునకు

'అవ్యయా దాప్సుపః' అను సూత్రముచే లోపము రాగా 'ససఖి' అని యగును.

సక్షత్రమ్: (క్షత్రియుల సంపత్తి) క్షత్రాణాం సంపత్తిః -క్షత్ర + ఆమ్ + సహ అను అలౌకిక విగ్రహవాక్యమున సహ అను అవ్యయమునకు క్షత్ర + ఆమ్ అను సుబంతముతో సమాసము. తక్కిన ప్రక్రియ ఉపకృష్ణమ్ వలెనే. 'అవ్యయీభావే....' అను సూత్రముచే సహశబ్దమునకు సాదేశము వచ్చుట ఇట విశేషము.

సతృణమ్ (తృణమునుకూడ వదలిపెట్టక -అనగా మొత్తము) తృణమపి అపరిత్యజ్య -తృణ + అమ్ + సహ అను అలౌకికవిగ్రహ వాక్యమున సాకల్యార్థకమగు 'సహ' అను అవ్యయమునకు తృణ + అమ్ అను సుబంతముతో సమాసము. పూర్వ నిపాతాదులు యథాపూర్వము. "అవ్యయీభావే...." అను సూత్రముచే 'సహ' శబ్దమునకు 'స' ఆదేశము.

సాగ్ని : (అగ్నిచయనమును ప్రతిపాదించు గ్రంథమువరకు) అగ్ని గ్రంథపర్యంతమ్ అను అర్థమున అగ్ని + ఙస్ + సహ అనుచోట అంతా (పర్యంతా)ర్థకమగు 'సహ' అను అవ్యయమునకు అగ్ని + ఙస్ అను సుబంతముతో సమాసము. పూర్వ నిపాతాదులు 'అధిహరి' అనుచోటవలెనే వచ్చును. 'అవ్యయీభావే....' అను సూత్రముచే సహశబ్దమునకు 'స' ఆదేశము.

**సూ : నదీభిశ్చ 2-1-20**

వృ : నదీభిః సహ సంఖ్యా సమస్యతే (సమాహారే చాయమిష్యతే) పంచగంగమ్, ద్వియమునమ్.

సంఖ్యావాచకపదము సుబంతములగు నదీవాచక శబ్దముతో సమసించును.

వా : సమాహారే చాయమిష్యతే.

(వార్తిక మందలి 'చ' శబ్దము ఏవార్థకము) పై సూత్రమున విధింపబడిన అవ్యయీభావసమాసము సమాహారార్థమునే వచ్చును. సమాహారమనగా సముదాయము.

సప్తగంగమ్ - (ఏడుగంగల సముదాయము) పంచానాం గంగానాం సమాహారః - పంచన్ + ఆమ్ గంగా + ఆమ్ అను అలౌకిక విగ్రహ వాక్యమున 'నదీభిశ్చ' అను సూత్రముచే సంఖ్యా వాచకమగు పంచన్ శబ్దమునకు గంగాశబ్దముతో సమాసము. 'సంఖ్యా' అను ప్రథమచే నిర్దిష్టమగుటచే ఉపసర్జనమైన పంచన్ శబ్దమునకు పూర్వ నిపాతము. సుబ్లోపము (పంచన్ + గంగా) 'న' లోపము (పంచ + గంగా) అవ్యయీభావశ్చ అను సూత్రముచే అవ్యయీభావము. నపుంసక మగుటచే 'హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య, అను సూత్రముచే హ్రస్వము (పంచ గంగ). సముదాయముపై సుప్ ప్రత్యయము, అమాదేశము రాగా పంచగంగమ్ అను రూపము సిద్ధించును.

ద్వియమునమ్ : (రెండు యమునల సముదాయము) ద్వయోః యమునయోః సముదాయః-ద్వి + ఓస్ + ఓస్ + యమునా + ఓస్ అను చోట 'నదీభిశ్చ' అను సూత్రముచే సంఖ్యావాచకమగు ద్విశబ్దమునకు పూర్వనిపాతము. సుబ్లోపము, హ్రస్వము, సముదాయముపై సుప్ ప్రత్యయము, అమా దేశము రాగా ద్వియమునమ్ అను రూపము సిద్ధించును.

**సూ : తద్ధితాః 4-1-76**

వృ : ఆపంచమసమాప్తే రధికారోఽయమ్

పంచమాధ్యాయము చివరి వరకు తద్ధితాః అను పదము అధికరించును.

ఈ సూత్రము మొదలుకొని 5 వ అధ్యాయము చివరివరకు చెప్పబడిన ప్రత్యయములన్నియు తద్ధితములని భావము.

**సూ : అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః 5-4-10**

వృ : శరదాదిభ్యష్టచ్ స్యాత్సమాసాంతోఽవ్యయీభావే. శరదః సమీపముపశరదమ్; ప్రతి విపాశమ్.

అవ్యయీభావ సమాసమున శరత్ మున్నగు శబ్దములపై టచ్ ప్రత్యయము సమాసాంతముగ వచ్చును.

ఉపశరదమ్ : (శరత్కాల సమీపమున) శరదః సమీపే అని లౌకికవిగ్రహ వాక్యము. శరద్ + ఙస్ + ఉప అని అలౌకిక విగ్రహ వాక్యము. 'అవ్యయం విభక్తి'.... అను సూత్రముచే సమీపార్థకమగు ఉప అను అవ్యయమునకు శరద్ శబ్దముతో అవ్యయీభావ సమాసము రాగా ఉపశరద్ అని యగును. ఈ సూత్రముచే 'శరద్' శబ్దముపై టచ్ (అ) ప్రత్యయము సమాసాంతముగ రాగా, ఉప శరద్ + అ = ఉపశరద అను అకారాంత ప్రాతిపదిక మేర్పడును. పిదప దానిపై సుప్ ప్రత్యయము, సుప్పునకు అమాదేశము రాగా ఉపశరదమ్ అని యగును.

ప్రతివిపాశమ్ : (విపాశ నదికి ఎదురుగా) విపాశః అభిముఖం అని లౌకికవిగ్రహ వాక్యము. విపాశ్ + ఙస్ + ప్రతి అను అలౌకిక విగ్రహ వాక్యమున "లక్షణేనాభి ప్రతీ...." అను సూత్రముచే అవ్యయీభావ సమాసము రాగా 'ప్రతివిపాశ్' అని యగును. ప్రకృత సూత్రముచే

సమాసాంతముగ టచ్ (అ) ప్రత్యయము రాగా ప్రతివిపాశ అని యగును. ప్రథమైకవచనమున ప్రతివిపాశమ్ అను రూపము సిద్ధించును.

**గ. సూ : జరాయా జరశ్చ**

వృ : ఉపజరసమిత్యాది.

జరాశబ్దమునకు జరస్ అను ఆదేశమును వచ్చును.

ఉపజరసమ్ :- (వృద్ధత్వ సమీపమున) జరాయాః సమీపే అని లౌకిక విగ్రహ వాక్యము. జరా + జస్ + ఉప అని అలౌకిక విగ్రహ వాక్యము. "అవ్యయం...." అను సూత్రముచే అవ్యయీభావము రాగా 'ఉపజరా' అని యగును. అవ్యయీ భావే అను సూత్రముచే 'టచ్' (అ) ప్రత్యయము (ఉపజరా + అ) ఈ గణ సూత్రముచే జరాశబ్దమునకు జరసాదేశము (ఉపజరస్ + అ) సుప్రత్యయము, దానికి అమాదేశము రాగా 'ఉపజరసమ్' అని యగును.

**సూ : అనశ్చ 5-4-108**

వృ : అన్నంతాదవ్యయీభావాట్టచ్ స్యాత్.

అన్నంతమగు అవ్యయీభావముపై టచ్ ప్రత్యయము వచ్చును.

**సూ : న స్తద్ధితే 6-4-144**

వృ : నాంతస్య భస్య టేర్లోప స్తద్ధితే; ఉపరాజమ్, అధ్యాత్మమ్.

తద్ధిత ప్రత్యయము పరమగునపుడు నకారాంతమగు 'భ' సంజ్ఞకము యొక్క 'టి' కి లోపము వచ్చును.

ఉపరాజమ్ : రాజ్ఞః సమీపే అని లౌకిక విగ్రహ వాక్యము. రాజన్ + ఙస్ + ఉప అని అలౌకిక విగ్రహ వాక్యము 'అవ్యయం'. అను

సూత్రముచే అవ్యయీభావము రాగా ఉపరాజన్ అని యగును. ఇది అన్నంతమగు అవ్యయీభావమగుటచే సమాసాంతముగ టచ్ ప్రత్యయము (ఉపరాజన్ + అ); తద్ధితము (టచ్) పరమగుటచే ప్రకృత సూత్రముచే ఉపరాజన్ శబ్దములోని 'టి' కి (అన్ కు) లోపము రాగా 'ఉపరాజ' అని యగును. పిదప సు ప్రత్యయము. 'సు' కు అమాదేశమును రాగా ఉప రాజమ్ అను రూపమేర్పడును.

అధ్యాత్మమ్ : (ఆత్మలో) ఆత్మని అని లౌకిక విగ్రహ వాక్యము. ఆత్మన్ + ఙి + అధి అను అలౌకిక విగ్రహ వాక్యమున విభక్త్యర్థమగు అధి అను అవ్యయమునకు ఆత్మన్ శబ్దముతో సమాసము రాగా అధ్యాత్మన్ అని యగును. తరువాతి ప్రక్రియ 'ఉపరాజమ్' అనుదానివలెనే.

సూ : నపుంసకాదన్యతరస్యామ్ 5-4-109

వృ : అన్నంతం యత్ క్లీబం తదన్తా దవ్యయీబావాట్టజ్వా స్యాత్. ఉపచర్మమ్, ఉపచర్మ.

అన్నంత మగు క్లీబ శబ్దమంతమందు గల అవ్యయీభావముపై 'టచ్' ప్రత్యయము వికల్పముగా వచ్చును.

ఉపచర్మమ్; ఉప చర్మ (చర్మము సమీపమున) చర్మణః సమీపే అని లౌకిక విగ్రహ వాక్యము. చర్మన్ + ఙస్ + ఉప అను సూత్రముచే సమాసము రాగా ఉపచర్మన్ అని యగును. ఇది అన్నంతమును, నపుంసకమును అగు చర్మన్ శబ్ద మంతమందుగలదగుటచే ప్రకృత సూత్రముచే వైకల్పిక టచ్ ప్రత్యయము. (ఉప చర్మన్ + అ) నస్తద్ధితే' అను సూత్రముచే టి (అన్) లోపము (ఉప చర్మ + అ)

పిదప సుప్ ప్రత్యయము, దానికి అమాదేశము రాగా ఉపచర్మమ్ అని యగును.

టచ్ ప్రత్యయము రాని పక్షమున ఉప చర్మన్ ప్రాతిపదికముపై సుప్ ప్రత్యయము (ఉపచర్మన్ + సు) 'స్వమోర్నపుంసకాత్' అను సూత్రముచే సులోపము. (ఉప చర్మన్) 'నలోపః ప్రాతిపదికాంతస్య' అను సూత్రముచే నలోపము (ఉపచర్మ).

సూ :- ఝయః 5-4-111

వృ:- ఝయంతా దవ్యయీభావాట్ట జ్వా స్యాత్; ఉపసమిధమ్ ఉపసమిత్.

ఝయంతమగు అవ్యయీభావముపై టచ్ప్రత్యయము వికల్పముగా వచ్చును.

ఉప సమిధమ్ : (సమిధ సమిపమున) సమిధః సమీపే అని లౌకిక విగ్రహ వాక్యము. సమీపార్థకమగు ఉప అను అవ్యయమునకు సమిధ్ శబ్దముతో 'అవ్యయం........' అను సూత్రముచే సమాసము (ఉప సమిధ్) ఈ సూత్రముచే 'టచ్' ప్రత్యయము (ఉప సమిధ్ + అ) పిదప సుప్పు; సుప్పుకు అమాదేశము రాగా 'ఉప సమిధమ్' అని యగును. టచ్ప్రత్యయము రానిపక్షమున 'వాఽవసానే' అను సూత్రముచే ధకార మునకు చర్త్వము వికల్పముగ రాగా ఉప సమిత్, ఉప సమిద్ అను రూపములు సిద్ధించును.

# అథ తత్పురుషః

సూ : తత్పురుషః  **2-1-22**

వృ : అధికారోఽయం ప్రాగ్బహువ్రీహేః

ఈ సూత్రము 'శేషో బహువ్రీహిః' 2.2-23 వరకు అధికరించును. అనగా ఈ సూత్రము మొదలుకొని "శేషో బహువ్రీహిః' అను సూత్రము నకు పూర్వ సూత్రము వరకు గల సూత్రములచే విధింపబడిన సమాసము లన్నియు తత్పురుష సమాసములని భావము.

తత్పురుష సమాసమున రెండు పదములుండును. మొదటి పదమును పూర్వ పదమనియు, రెండవ పదమును ఉత్తర పదమనియు అందురు. తత్పురుషమున పూర్వపదము ప్రథమయందు తప్ప తక్కిన విభక్తుల యందును, ఉత్తరపదము ప్రథమయందును ఉండును.

సూ : ద్విగుశ్చ  **2-1-23**

వృ : ద్విగురపి తత్పురుషసంజ్ఞకః స్యాత్.

ద్విగుసమాసము కూడ తత్పురుషసంజ్ఞకమగును.

"తద్ధితార్థోత్తరపద సమాహారే చ" అను సూత్రముచే విధింపబడు సమాసమునకు "సంఖ్యా పూర్వో ద్విగుః' అను సూత్రముచే ద్విగుసంజ్ఞ విధింపబడినది. అట్టి ద్విగు సంజ్ఞకములగు సమాసములు తత్పురుష సంజ్ఞకములు కూడ నగును. ఈ సూత్రము లేనిచో ద్విగుసంజ్ఞచే తత్పు రుష సంజ్ఞ బాధింపబడి ద్విగు సమాసమునకు తత్పురుష సంజ్ఞ లేకుండెడిది.

**సూ : ద్వితీయా శ్రిత - తాతీత - పతిత - గ - తాత్యస్త - ప్రాప్తాపన్నైః 2-1-24**

వృ : ద్వితీయాన్తం శ్రితాది ప్రకృతికైః సుబన్తైః సహ వా సమస్యతే; స చ తత్పురుషః; కృష్ణమ్ శ్రితః కృష్ణశ్రిత ఇత్యాది.

ద్వితీయా విభక్త్యంతమగు పదము శ్రిత, అతీత, పతిత, గత, అత్యస్త, ప్రాప్త, ఆపన్న మొదలగు శబ్దములు ప్రకృతులుగా గల సుబంతముతో వికల్పముగ సమసించును. అది తత్పురుషమగును.

కృష్ణశ్రితః : కృష్ణం శ్రితః అని లౌకిక విగ్రహము. కృష్ణ + అమ్, శ్రిత + సు అని లౌకికవిగ్రహము - కృష్ణ + అమ్ అను ద్వితీయాంతమగు పదమునకు శ్రిత + సు అను సుబంతముతో ఈ సూత్రముచే సమాసము - సమాసమును విధించు ఈ సూత్రమున "ద్వితీయా" అనునది ప్రథమా నిర్దిష్ట మగుటచే "ప్రథమానిర్దిష్టం" అను సూత్రముచే కృష్ణ + అమ్ అను ద్వితీయాంతమునకు ఉపసర్జన సంజ్ఞ. 'ఉపసర్జనమ్ పూర్వమ్' అను సూత్రముచే కృష్ణ శబ్దమునకు పూర్వనిపాతము. పిదప సుబ్లోపము రాగా కృష్ణశ్రిత అని యగును.

ఇట్లే దుఃఖాతీత (దుఃఖం అతీతః) ఇత్యాది స్థలములలో పై విధము గనే సమాసప్రక్రియ.

**సూ : తృతీయా తత్కృతార్థేన గుణవచనేన 2-1-30**

వృ : తృతీయాంతం తృతీయాంతార్థ కృత గుణవచనే నార్థేన చ సహ వా ప్రాగ్వత్. శంకులయా ఖండః శంకులాఖణ్డః; ధాన్యేనార్థో ధాన్యార్థః; తత్కృతేతి కిమ్? అక్ష్ణా కాణః

తృతీయాంతము తృతీయాంతమగు పదము యొక్క అర్థముచే నేర్పడు గుణమును తెలుపు పదముతోడను, అర్థ శబ్దముతోడను సమసించును.

శంకులాఖండః : శంకులయా ఖండః అని లౌకిక విగ్రహ వాక్యము. శంకులాఖండః అనగా శంకులచే కావింపబడిన ఖండనము గల వాడు అని అర్థము. శంకులా + టా + ఖండ + సు అని అలౌ. వి.వా. ఇట ఖండ శబ్దము గుణవాచకము. ఆ ఖండనమగు గుణము తృతీయాంతమగు శంకులా శబ్దార్థముచే నేర్పబడినది. కనుక ఈ సూత్రముచే తృతీయాంత శంకులా శబ్దమునకు ఖండ + సు అను సుంతబముతో సమాసము పూర్వనిపాత సుబ్లోపములు రాగా శంకులాఖండః అని యగును.

తృతీయాంతమగు పదము యొక్క అర్థముచే నేర్పడు గుణమును తెలుపు పదముతో తృతీయాంతమునకు సమాసమనుటచే 'అక్ష్ణా కాణః' అనుచోట కాణత్వమను గుణము అక్ష్ణా అను తృతీయాంతపదముయొక్క అర్థముచే నేర్పడినదికాదు. (గ్రుడ్డితనమునకు రోగాదికము కారణము కాని కన్ను కారణము కాదు కనుక) కనుక ఈ సూత్రముచే తత్పురుష సమాసము రాదు. అక్షికాణః అని కాదు. అక్ష్ణా కాణః అని వ్యస్తముగానే ప్రయోగింపవలెను.

ధాన్యార్థః : ధాన్యేన అర్థః అని లౌకిక విగ్రహము. ధాన్య + టా + అర్థ + సు అనునది అలౌకిక విగ్రహము. తృతీయాంతమగు ధాన్య శబ్దమునకు ఈ సూత్రముచే అర్థ శబ్దముతో సమాసము- పూర్వ నిపాత, సుబ్లోపములు రాగా ధాన్యార్థః అని యగును.

**సూ : కర్తృకరణే కృతా బహుళమ్ 2-1-32**

వృ : కర్తరి కరణే చ తృతీయా కృదన్తేన బహుళం ప్రాగ్వత్; హరిణా త్రాతో హరిత్రాతః- నఖైర్భిన్నో నఖభిన్నః.

కర్త్రర్థకమగు తృతీయాంతము, కరణార్థకమగు తృతీయాంతము కృదంతముతో బహుళముగా సమసించును.

హరిత్రాతః - హరిణా త్రాతః అని లౌకిక విగ్రహవాక్యము. హరి + టా అనునది కర్త్రర్థక తృతీయాంతమగుటచే దానికి త్రాత అను కృదంతముతో సమాసము. ఉపసర్జన సంజ్ఞచే హరిణా అను తృతీయాంతమునకు పూర్వనిపాతము - సుబ్లోపము.

నఖభిన్నః : నఖైః భిన్నః అని లౌకిక విగ్రహము. నఖ + భిస్ + భిన్న + సు అనునది అలౌకిక విగ్రహము. కరణార్థక తృతీయాంతమగు నఖ + భిస్ అనుదానికి భిన్న + సు అను కృదంతముతో సమాసము - పూర్వనిపాతము - సుబ్లోపము.

ప : కృద్గ్రహణే గతికారకపూర్వస్యాపి గ్రహణమ్; నఖనిర్భిన్నః కృదంతమును గ్రహించినపుడు గతి సంజ్ఞకమును, కారకమును పూర్వమందుగల కృదంతమునుకూడ గ్రహింపవలెను.

నఖనిర్భిన్నః :- నఖైః నిర్భిన్నః అని లౌకిక విగ్రహము. భిన్న యనునది కృదంతము కాని నిర్భిన్న యనునది కృదంతము కాదు. అది కృదంతాంతము. కనుక 'కర్తృకరణే' అను పూర్వ సూత్రముచే తృతీయాంతమగు నఖ శబ్దమునకు నిర్భిన్న శబ్దముతో సమాసము రాకపోగా పరిభాష చెప్పబడినది. ఇట నిర్ అనునది గతి సంజ్ఞకము. కనుక తత్పూర్వకమగు భిన్న యను కృదంతముతో గూడ తృతీయాంతమునకు సమాసము చేయగా 'నఖనిర్భిన్న' అని యగును.

**సూ : చతుర్థీ తద-ర్థార-బలి-హిత-సుఖ-రక్షితైః 2-1-36**

వృ :- చతుర్థ్యంతార్థాయ యత్ తద్వాచినా అర్థాదిభిశ్చ చతుర్థ్యంతం వా ప్రాగ్వత్. యూపాయ దారు యూపదారు; (తదర్థేన ప్రకృతివికృతిభావ ఏవేష్టః)తేనేహ న; రంధనాయ స్థాలీ.

ఇట తత్ అనగా చతుర్థ్యంతము. తదర్థమనగా చతుర్థ్యంతముచే బోధింపబడు అర్థము - తదర్థార్థ మనగా చతుర్థ్యంతముచే బోధింపబడు అర్థము కొఱకైన వస్తువు. చతుర్థ్యంతమైన పదము చతుర్థ్యంతముచే బోధింపబడు అర్థము కొరకైన వస్తువును తెలుపు పదముతోడను అర్థ, బలి హిత, సుఖ, రక్షిత అను పదములతోడను సమసించును.

యూపదారు :- యూపాయ దారు (యూపస్తంభము కొరకైన దారువు) అని లౌకిక విగ్రహము. దారువు చతుర్థ్యంత మగు. యూప స్తంభము కొరకు - కనుక యూప + ఙే అను చతుర్థ్యంతము దారు + సు అను సుబంతముతో సమసించును. -సుబ్లోపము.

ఇట తదర్థ అనుచోట దానికొరకైనది అని మాత్రమే అర్థము కాక దానికి ప్రకృతియైనది అని యర్థము. యూపదారు అనుచోట దారువు ప్రకృతి. యూపము వికృతి. ఇట్టి ప్రకృతి వికృతి భావము లేనిచోట ఈ సూత్రముచే సమాసము రాదు.

రంధనాయ స్థాలీ (వంటకొరకైన పాత్ర) అనుచోట స్థాలికి, రంధనమునకు ప్రకృతివికృతిభావము లేనందున సమాసము రాదు.

వా : అర్థేన నిత్యసమాసో విశేష్యలింగతాచేతి వక్తవ్యమ్.

ద్విజార్థః సూపః, ద్విజార్థా యవాగూః, ద్విజార్థం పయః; భూత బలిః. గోహితమ్, గోసుఖమ్, గోరక్షితమ్.

పూర్వసూత్రముచే చతుర్థ్యంతమునకు అర్థ శబ్దముతో విధింపబడిన సమాసము నిత్యసమాసమనియు, అట్టి సమస్త పదము రాని విశేష్యము ఏ లింగమున నుండునో ఆ లింగమునందుండునని చెప్పవలెను.

ద్విజార్థః సూపః : ద్విజాయ అని లౌకిక విగ్రహవాక్యము ద్విజ + జే అని అలౌకిక విగ్రహము. పూర్వ సూత్రముచే ద్విజ + జే అను చతుర్థ్యంతమునకు అర్థశబ్దముతో నిత్యసమాసము, సుబ్లోపము (ద్విజ + అర్థ) ఇట విశేష్యము సూపః అనునది కనుక దాని ననుసరించి (ద్విజ + అర్థ) ద్విజార్థః అనునది కూడ పుంలింగమైనది. యవాగూః స్త్రీలింగ పదము విశేష్యమగునపుడు ద్విజార్థా అనియు, పయః అను నపుంసక లింగపదము విశేష్యమగునపుడు ద్విజార్థం అనియు రూపము లేర్పడును.

భూతబలిః : భూతేభ్యః బలిః (భూతముల కొరకైన బలి) భూత + భ్యస్; బలి + సు అనునది అలౌకిక విగ్రహము. చతుర్థ్యంత భూతశబ్ద మునకు పూర్వసూత్రముచే బలిశబ్దముతో సమాసము - సుబ్లోపము.

గోసుఖమ్ : గవే సుఖమ్ అని లౌకిక విగ్రహము గో + జే + సుఖ + సు అని అలౌకిక విగ్రహము; పూర్వసూత్రముచే సమాసము - సుబ్లోపము.

గోరక్షితమ్ : గోభ్యః రక్షితమ్ అని అలౌకిక విగ్రహము. గో + భ్యస్రక్షిత + సు అని అలౌకిక విగ్రహము. పూర్వసూత్రముచే సమాసము- సుబ్లోపము.

**సూ :- పంచమీ భయేన 2-1-37**

వృ : చోరాద్భయం చోరభయమ్.

పంచమ్యంతమగు పదము సుబంతమగు భయశబ్దముతో సమ సించును.

చోరభయమ్ : చోరాత్ భయమ్ అని లౌకిక విగ్రహ వాక్యము. చోర + జసి + భయ + సు అని అలౌకిక విగ్రహ వాక్యము. ఈ సూత్ర ముచే పంచమ్యంతమగు చోర శబ్దమునకు భయశబ్దముతో సమాసము. సుబ్లోపము.

సూ :- స్తోకాంతికదూరార్థ కృచ్ఛ్రాణి క్తేన 2-1-39

స్తోకార్థకములు (కొంచెము అను అర్థము గలవి), అంతి కార్థములు (సమీపార్థకములు), దూరార్థకములు అగు పంచమ్యంత శబ్ద ములు. కృచ్ఛ్ర శబ్దమును పంచమ్యంత క్త ప్రత్యయాంతమగు సుబంత ముతో సమసించును.

స్తోకాన్ముక్తః : స్తోక + ఙసి, ముక్త + సు అని. అలౌకిక విగ్రహ వాక్యము. స్తోక + ఙసి అను పంచమ్యంతము ముక్త అను క్త ప్రత్యయాం తముతో ఈ సూత్రముచే సమసించును. స్తోక శబ్దముపైని విభక్తిప్రత్య యమునకు "సుపో ధాతుప్రాతిపదికయోః" అను సూత్రముచే లోపము రావలసియుండగా ఈ క్రింది సూత్రముచే పంచమీ విభక్తికి అలుక్కు (లోపము రాదని) చెప్పబడుచున్నది.

సూ : పంచమ్యాః స్తోకాదిభ్యః 6-3-2

వృ : అలుగుత్తరపదే; స్తోకాన్ముక్తః, అంతికాదాగతః, అభ్యాశాదా గతః, దూరాదాగతః, కృచ్ఛ్రాదాగతః.

ఉత్తర పదము పరమగునపుడు స్తోక మున్నగు శబ్దములకు పర మందున్న పంచమీ విభక్తికి లుక్కు (లోపము) రాదు. స్తోక + ఙసి + + సు అనుచోట ఈ సూత్రముచే పంచమికి లోపము రాకపోగా 'సు'కు మాత్రమే లోపము వచ్చును. 'టాఙసి' అను సూత్రముచే ఙసికి ఆత్ అను ఆదేశము రాగా 'స్తోకాన్ముక్త' అని యగును. ఇట్లే అంతికాదాగతః, అభ్యాశాదాగతః; దూరాదాగతః; కృచ్ఛ్రాదాగతః అను రూపములు సిద్ధించును.

సూ : షష్ఠీ 2-2-8

వృ : సుబంతేన ప్రాగ్వత్; రాజపురుషః

షష్ఠ్యంతము సుబంతముతో సమసించును. దానికి తత్పురుషమని పేరు.

రాజపురుషః : రాజ్ఞః పురుషః అని లౌకికవిగ్రహ వాక్యము. రాజన్ + అస్ + పురుష + సు అను అలౌకికవిగ్రహవాక్యమున రాజన్ + అస్ అను షష్ఠ్యంతమునకు పురుష + సు అను సుబంతముతో సమాసము - సుబ్లోపము.

సూ : పూర్వాపరాధరోత్తరమేకదేశినైకాధికరణే 2-2-1

వృ : అవయవినా సహ పూర్వాదయః సమస్యంతే ఏకత్వ సంఖ్యా విశిష్టశ్చేదవయవీ; షష్ఠీసమాసాపవాదః. పూర్వం కాయస్య పూర్వ కాయః; అపరకాయః. ఏకాధికరణే కిమ్? పూర్వశ్ఛాత్రాణామ్.

ఏకదేశమనగా అవయవము.ఏకదేశి యనగా అవయవము కలది. అనగా అవయవి అని అర్థము. ఏకాధికరణమనగా ఏకద్రవ్యము. పూర్వ, అపర, అధర, ఉత్తర అను పదములు ఏకద్రవ్యరూపమగు అవయవిని బోధించు సుబంతములతో సమసించును.

పూర్వకాయః : పూర్వం కాయస్య (శరీరముయొక్క పూర్వ భాగము) అని అలౌకిక విగ్రహవాక్యము. పూర్వ + సు + కాయ + ఙస్ అనిఅలౌకికవిగ్రహవాక్యము. ఇట పూర్వ శబ్దమునకు ఏకత్వసంఖ్యావిశిష్ట మగు అవయవిని తెలుపు కాయశబ్దముతో సమాసము-సుబ్లోపము.

ఈ సూత్రమున "పూర్వాపరాధరోత్తరమ్" అనునది ప్రథమా నిర్దిష్టమగుటచే పూర్వ, అపర మున్నగునవి ఉప సర్జనసంజ్ఞకములు. వానికి సమాసమున పూర్వనిపాతము. ఇట ఈ సూత్రము షష్ఠీ అను సూత్రమున కపవాదము. షష్ఠీ అను సూత్రముచే సమాసము చెప్పిన యెడల షష్ఠీ అను సమాసవిధాయకసూత్రమున షష్ఠ్యంతమునకే ప్రథమానిర్దేశ ముండుటచే ఉపసర్జన సంజ్ఞ, పూర్వనిపాతములు వచ్చి, కాయ పూర్వ ఇత్యాద్యనిష్ట రూపములు సిద్ధించెడివి. ఇట్లే అపర కాయః (అపరం కాయస్య) అధర కాయః (అధరం కాయస్య) ఇత్యాది సమాసములు సిద్ధించును. పూర్వః ఛాత్రాణాం అనుచోట ఛాత్ర అను అవయవి వాచక శబ్దము ఏకత్వసంఖ్యావిశిష్టము కాదు. (బహుత్వసంఖ్యావిశిష్టము) కనుక ఈ సూత్రముచే సమాసము రాదు.

సూ: అర్ధం నపుంసకమ్ 2-2-2

వృ : సమాంశవాచ్యర్ధశబ్దో నిత్యం క్లీబే, స ప్రాగ్వత్; అర్ధం పిప్పల్యాః అర్ధపిప్పలీ.

అర్ధ శబ్దమునకు అంశము అనియు, సగము భాగమనియు అర్థములు గలవు. అంశవాచకమగు అర్ధశబ్దము పుంలింగ, నపుంసకముల యందుండును. సమాంశ (సగము భాగము) వాచకమగు అర్ధ శబ్దము నపుంసకలింగమున మాత్రమే యుండును.[1] నిత్య నపుంసకలింగమందుండు సమాంశవాచియగు అర్ధశబ్దము ఏకత్వసంఖ్యావిశిష్టమగు అవయవి వాచకముతో సమసించును.

---

1. వా పుంస్యర్ధోఽర్ధం సమేంశకే అని అమరకోశము.

అర్ధపిప్పలీ : అర్ధం పిప్పల్యాః అని లౌకికవిగ్రహము. అర్ధ + సు + పిప్పలీ + జస్ అని యుండగా ఈ సూత్రముచే సమాసము, సుబ్లోపము (అర్ధ + పిప్పలీ) సూత్రమున ప్రథమానిర్దిష్టమగు అర్ధశబ్దము ఉపసర్జనమగుటచే దానికి పూర్వనిపాతము రాగా "అర్ధపిప్పలీ" అని యగును.

నిత్య నపుంసమగు అర్ధ శబ్దమే ఏకత్వసంఖ్యావిశిష్టమగు అవయవి వాచకముతో సమసించుననుటచే గ్రామస్య అర్ధః అనుచోట 'షష్ఠీ' అను సూత్రముచే సమాసము వచ్చును. ఈ సూత్రముచే సమాసము వచ్చినచో అర్ధ గ్రామః అను అనిష్ట రూప మేర్పడెడిది. నిత్య నపుంసకమగు అర్ధ శబ్దము అవయవివాచకము, ఏకత్వ సంఖ్యా విశిష్టము ఐనపుడే సమసించుననుటచే అర్ధం పిప్పలీనాం అనుచోట ఈ సూత్రముచే సమాసము రాదు.

సూ : సప్తమీ శౌండైః 2-1-40

వృ : సప్తమ్యంతం శౌండాదిభిః ప్రాగ్వత్. అక్షేషు శౌండః అక్షశౌండ ఇత్యాది.

సప్త మ్యంతమగు పదము శౌండ మున్నగు సుబంతములతో సమసించును.

అక్షశౌణ్డః : అక్షేమ శౌండః (పాచికల యాటలో నేర్పరి) అని లౌకికవిగ్రహము. అక్ష + సుప్ శౌండ + సు అనుచోట ఈ సూత్రముచే అక్ష సుప్‌అను సప్త మ్యంతమునకు శౌండ + సు అను సుబంతముతో సమాసము. సుబ్లోపము (అక్ష శౌండ)

వృ : ద్వితీయా, తృతీయా ఇతి యోగవిభాగాత్ అన్యత్రాపి తృతీయాదివిభక్తీ నాం ప్రయోగవశాత్ సమాసో జ్ఞేయః

"ద్వితీయా, శ్రితాతీత" ఇత్యాది సూత్రములచే ద్వితీయాంతములకు ఆయా సూత్రములందు చెప్పబడిన శ్రితాది పదములతో మాత్రమే సమాసము వచ్చునని చెప్పబడినది. కాని ద్వితీయాంతాదులకు శ్రిత మున్నగు వానికంటె భిన్నమగు సుబంతములతోడను సమాసములు ప్రయోగమున కనబడుచున్నవి. కనుక ఈ సూత్రములలో ద్వితీయా, తృతీయా అను పదములను యోగ విభాగము చేసి (విడదీసి) వానిని స్వతంత్ర సూత్రములుగ పరిగణించినచో ద్వితీయాంతాదులు శ్రితాది సుబంతముల తోనేగాక ప్రయోగానుసారముగ ఇతర సుబంతములతోడను సమసించు నని తేలును.

సూ :- దిక్సంఖ్యే సంజ్ఞాయామ్ 2-1-50

వృ : సంజ్ఞా యామేవేతి నియమార్థం సూత్రమ్. పూర్వేషుకామ శమీ. సప్తర్షయః, తేనేహే న; ఉత్తరా వృక్షాః, పంచ బ్రాహ్మణాః

దిగ్వాచకములు మరియు సంఖ్యావాచకములు సమానాధికరణమగు సుబంతముతో సంజ్ఞార్థమున సమసించును.

పూర్వేషుకామశమీ:- పూర్వాశ్చాసౌ ఇషుకామశమీ చ అని లౌకిక విగ్రహ వాక్యము. పూర్వ + సు + ఇషుకామశమీ + సు అనుచోట ఈ సూత్రముచే దిగ్వాచకమగు పూర్వ శబ్దమునకు ఇషు కామ శమీ + సు అను సుబంతముతో సమాసము. సుబ్లోపము. పూర్వేషు కామ శమీ యను నది ఒక పట్టణమునకు పేరు.

సప్తర్షయః : సప్త చ తే ఋషయశ్చ అని లౌకిక విగ్రహ వాక్యము. - సప్తన్ + జస్ + ఋషి + జస్ అను అలౌకిక విగ్రహ వాక్యమున సప్తన్ అను సంఖ్యావాచక శబ్దమునకు ఈ సూత్రముచే

ఋషి + జస్ అను సుబంతముతో సమాసము సుబ్లోపము (సప్తన్ + ఋషి) 'న లోపః' అను సూత్రముచే నకారలోపము, గుణము (సప్తర్షయః) సప్తర్షయః అనునది సంజ్ఞావాచకము.

'విశేషణం విశేష్యేణ బహుళమ్' అను సూత్రముచేతనే పై సమాసములు సిద్ధించుచుండగా మరల ఈ సూత్రముచే సమాసము విధించుట సమాస పదము సంజ్ఞావాచకమైనపుడే దిగ్వాచకములు, సంఖ్యావాచకములు సమానాధికరణసుబంతములతో సమసించునను నియమము కొరకు. కనుక ఉత్తరాః వృక్షాః (ఉత్తరమున నున్న వృక్షములు) పంచ బ్రాహ్మణాః (ఐదుగురు బ్రాహ్మణులు) ఇత్యాది స్థలములలో సంజ్ఞార్థము లేకపోవుటచే ఈ సూత్రముచే సమాసము రాదు.

సూ : తద్ధితార్థోత్తరపదసమాహారే చ 2-1-51

వృ : తద్ధితార్థే విషయే ఉత్తరపదే చ పరతః సమాహారే చ వాచ్యే దిక్సంఖ్యే ప్రాగ్వత్. పూర్వస్యామ్ శాలాయాం భవః; పూర్వా శాలా ఇతి సమాసే జాతే.

తద్ధితార్థము (తత్ర భవః ఇత్యాదికము) విషయ మగునపుడును, ఉత్తరపదము పరమగునపుడును, సమాహారము వాచ్యమగునపుడును దిగ్వాచకములు మరియు సంఖ్యా వాచకములు సమానాధికరణములతో సమసించును.

పౌర్వశాలః : పూర్వస్యాం శాలాయాం భవః (తూర్పుశాలలో ఉన్నవాడు) అని లౌకికవిగ్రహవాక్యము. ఇట తత్ర భవః (అచట నున్న

వాడు) అను తద్ధితార్థమున దిక్పూర్వపదాత్ అను రాబోవు సూత్రముచే 'ఞ' ప్రత్యయము విధింపబడుచున్నది. కావున తద్ధితార్థము విషయ మగుటచే ఈ సూత్రముచే దిగ్వాచక పూర్వాశబ్దమునకు శాలా శబ్దముతో సమాసము. పూర్వ + ఙి + శాలా + ఙి అనునది అలౌకిక విగ్రహ వాక్యము. సుబ్లోపము రాగా (పూర్వా + శాలా) అని కాగా

వా : సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః

[1]వృత్తులైదింటియందును సర్వనామశబ్దమునకు పుంవద్భావము వచ్చును.

పూర్వా శాలా అనుచోట పూర్వాశబ్దము సర్వనామ మగుటచేత ఈ సమాసవృత్తియందు దానికి వార్తికముచే పుంవద్భావము రాగా పూర్వ శాలా అని కాగా

**సూ : దిక్పూర్వపదాదసంజ్ఞాయాం ఞః 4-2-107**

వృ : అస్మాద్భవాద్యర్థే ఞః స్యాదసంజ్ఞాయామ్.

దిగ్వాచకశబ్దము పూర్వపదముగానున్న సమాసముపై అది సంజ్ఞా వాచకము కానిచో తత్ర భవః (అచట నున్నది) అను అర్థమున ఞ ప్రత్యయము వచ్చును.

పూర్వ శాలా అనునది సంజ్ఞావాచకము కాదు. దిగ్వాచకశబ్దము పూర్వమందుగలది - కనుక పూర్వశాలా అను శబ్దముపై ఈ సూత్రముచే ఞ (అ) ప్రత్యయము రాగా పూర్వాశాలా + అ అని కాగా

**సూ : తద్ధితేష్వచామాదేః 7-2-117**

వృ : ఞితి ణితి చ తద్ధితేష్వచామాదేరచో వృద్ధిః స్యాత్. యస్యేతి చ. పౌర్వ శాలః. పఞ్చ గావో ధనం యస్యేతి త్రిపదే బహు వ్రీహౌ.

---

1. కృత్తద్ధిత సమాసైక శేష సనాద్యన్త ధాతురూపములగును.

ఞిత్తు, ణిత్తు ఐన తద్ధితప్రత్యయము పరమగునప్పుడు ప్రకృతి యందలి అచ్చులలో తొలియచ్చుకు వృద్ధి వచ్చును.

పూర్వశాలా + అ అనుచోట ఞిత్తగు తద్ధితము పరమగుటచే ఈ ఈ సూత్రముచే పూర్వశాలా అను ప్రకృతి యందలి ఆద్యచ్చగుగు ఊకార మునకు వృద్ధి రాగా పౌర్వశాలా + అ అని కాగా 'యస్యేతి చ' అను సూత్రముచే లకారము మీది ఆ కారము లోపింపగా పౌర్వశాల్ + అ= పౌర్వశాల అని యగును.

పంచగవధనః : పంచ గావో ధనం యస్య అని లౌ.వి.వా. ఇది త్రిపద బహువ్రీహి. పంచగావః అను అవాంతరసమాసము తత్పురుషము. పంచన్ + జస్ + గో జస్ + ధన + సు అని అలౌకిక విగ్రహవాక్యము. ఇట ధనశబ్దము ఉత్తర పదము. అది పరముగా నున్నందున "తద్ధితార్థో త్తర పద" అను సూత్రముచే సంఖ్యావాచకమగు పంచన్ శబ్దమునకు గోశబ్దముతో వచ్చు సమాసము వికల్పముగా రావలసి యున్నది. కాని క్రింది వార్తికముచే నిత్యసమాసము విధింపబడుచున్నది.

వా : ద్వంద్వతత్పురుషయోరుత్తరపదే నిత్యసమాసవచనమ్.

ఉత్తర పదము పరమగునపుడు ద్వంద్వ తత్పురుషములకు సమాసము నిత్యముగా చెప్పవలెను. కనుక ఈ వార్తికముచే 'ధన' అను ఉత్తరపదము పరముగా నున్నందున పంచన్ శబ్దమునకు గో శబ్దముతోడి సమాసము (తత్పురుషము) నిత్యముగనే వచ్చును. సుబ్లోపము రాగా పంచన్ + గో అని కాగా

**సూ : గోర తద్ధితలుకి 5-4-92**

**వృ : గోఽంతాత్తత్పురుషాట్టచ్ స్యాత్ సమసాన్తో, నతు తద్ధితలుకి; పంచగవధనః**

గోశబ్దమంత మందుగల తత్పురుషముపై సమాసాంతముగా టచ్ ప్రత్యయము వచ్చును. తద్ధిత ప్రత్యయము లోపించినపుడు మాత్రము రాదు.

పంచన్ + గో అను అవాంతర తత్పురుషము గోశబ్దాంతమగుటచే ఈ సూత్రముచే టచ్ (అ) ప్రత్యయము రాగా పంచన్ + గో + అ అని యగును. 'నలోపః....' అను సూత్రముచే పంచన్‌లోని నకారమునకు లోపము రాగా పంచగో + అ అని కాగా 'ఏచోఽయవా' అను సూత్రముచే ఓకారమునకు అవాదేశము రాగా పంచగవ ధన అని యగును. పంచగవ ధనః అను సముదాయము బహువ్రీహి. ఇందలి ఏకదేశమగు 'పంచగవ' అనునది మాత్రము తత్పురుషము.

**సూ : తత్పురుషః సమానాధికరణః కర్మధారయః 2.1.42**

అధికరణమనగా వాచ్యము. సమానమగు అధికరణములు (వాచ్యములు) గల తత్పురుషము కర్మధారయము. ఉదా : శ్వేతాశ్వః అనుచోట శ్వేత అశ్వ అను నీ రెండు శబ్దములును గుఱ్ఱము అను వాచ్యమునే చెప్పుచున్నవి కాన సమానాధికరణమగుటచే నిది కర్మధారయము. ప్రకృతమున పంచగవ అనుచోట పంచన్ + గో అను రెండును ఆవులు అను వాచ్యమునే చెప్పుటచే ఈ తత్పురుషము కర్మధారయము.

రాజభటః :- రాజ్ఞః భటః = (రాజు యొక్క భటుడు) అను తత్పురుషమున రాజన్ శబ్దము రాజు అను వాచ్యార్థమును, భట శబ్దము సేవకుడు అను వాచ్యార్థమును బోధించుచున్నవి. రాజన్ భట అనునవి సమానమగు వాచ్యార్థమును బోధించుచు లేవు. కాన ఇది కర్మధారయము కానేరదు.

సూ : సంఖ్యాపూర్వో ద్విగుః 2-1-52

వృ:- తద్ధితార్థేత్య త్రోక్త స్త్రివిధః సంఖ్యాపూర్వో ద్విగుసంజ్ఞః స్యాత్.

'తద్ధి తార్థోత్తరపదసమాహారే చ' అను సూత్రముచే తద్ధితార్థము విషయమగునపుడు, ఉత్తర పదము పరమగునపుడు, సమాహారము వాచ్య మగునపుడును సంఖ్యా వాచకమునకు సమానాధి కరణముతో సమాసము విధింపబడినది. సంఖ్యా పూర్వకమగు ఈ త్రివిధమగు సమాసము ద్విగుసమాసమనబడును.

తద్ధితార్థము విషయమగునపుడు :- పంచకపాలః; పంచసు కపాలేషు సంస్కృతః

ఉత్తరపదము పరమగునపుడు :- పంచగవప్రియః; సమాహారము వాచ్యమగునపుడు - పంచగవమ్, పంచనాం గవాం సమాహారః

సూ :- ద్విగురేకవచనమ్. 2-4-1

వృ:- ద్విగ్వర్థః సమాహారే ఏకవత్ స్యాత్.

ద్విగుసమాసార్థమగు సమాహారము ఏకవద్భావమును పొందును. అనగా సమాహారము ఒక వస్తువుగ పరిగణింపబడును. అనగా సమాహారార్థమగు ద్విగువు ఏకవచనమున నుండునని ఫలితార్థము.

సూ : స నపుంసకమ్ 2-4-17

వృ : సమాహారే ద్విగుర్ద్వంద్వశ్చ నపుంసకం స్యాత్; పంచానాం గవాం సమాహారః పంచగవమ్.

సమాహారార్థకములగు ద్విగు, ద్వంద్వ సమాసములు నపుంసక లింగమున నుండును.

పంచగవమ్ : పంచానాం గవాం సమాహారః అని లౌకిక విగ్రహము. పంచన్ + ఆమ్; గో + ఆమ్ అను అలౌకిక విగ్రహ వాక్యమున తద్ధితార్థోత్తర అను సూత్రముచే సమాసము, సుబ్లోపము (పంచన్ + గో) 'గోరతద్ధిత' అను సూత్రముచే టచ్ (అ) ప్రత్యయము (పంచన్ + గో + అ) నలోపము, అవాదేశము (పంచగవ) పంచగవ యనునది ద్విగువగుటచే పూర్వ సూత్రములచే నపుంసకలింగము, ఏకవద్భావము రాగా పంచగవమ్ అను రూపము సిద్ధించును.

**సూ : విశేషణం విశేష్యేణ బహుళమ్ 2-1-57**

వృ : భేదకం భేద్యేన సమానాధికరణేన బహుళం ప్రాగ్వత్. నీలముత్పలమ్ నీలోత్పలమ్. బహుళగ్రహణాత్ క్వచిన్నిత్యమ్. క్వచిన్న. రామో జామదగ్న్యః

విశేషణమనగా భేదకము. ఇతర వస్తువుల నుండి విశేష్యమును వేరుచేయునది విశేషణము. నీలం ఉత్పలం అనుచోట నీలం అను ఉత్పల విశేషణముచే నీలోత్పలము నీలేతరములగు శుక్ల, రక్తోత్పలాదుల నుండి వేరు చేయబడుచున్నది. కాన నీల అనునది భేదకము (విశేషణము) విశేష్యమనగా భేద్యము. ఇతర వస్తువుల నుండి వేరు చేయబడునది విశేష్యము. నీలోత్పలమ్ అనుచోట ఇతరముల నుండి వేరు చేయబడునది ఉత్పలము. కనుక అది భేద్యము (విశేష్యము)

భేదకము (విశేషణము) సమానాధికరణమగు భేద్యము (విశేష్యము)తో బహుళముగ సమసించును.

నీలోత్పలమ్ (నీలమైన కమలము) నీలం చ తత్ ఉత్పలం చ అని లౌకికవిగ్రహము. నీల + సు + ఉత్పల + సు అను అలౌకిక విగ్రహ వాక్యమున భేదక (విశేషణ)మగు నీల శబ్దమునకు సమానాధికరణ (భేద్య) మగు ఉత్పల శబ్దముతో సమాసము. సుబ్లోపము రాగా ప్రథమైకవచన మున నీలోత్పలమ్ అను రూపము సిద్ధించును. ఈ సమాసము వికల్ప మగుటచే నీలోత్పలమ్ అను సమాస పదమేకాక నీలమ్ ఉత్పలమ్ అను వ్యస్త రూపము కూడ నుండును.

సూత్రమున బహుళ పదముండుటచే నీ సూత్రము కృష్ణ సర్పః ఇత్యాదిస్థలములలో నిత్యముగ ప్రవర్తించుటచే కృష్ణ సర్పః అను సమాస రూపమేకాని 'కృష్ణః సర్పః' అను వ్యస్త రూపముండదు. రామో జామదగ్న్యః అనుచోట జామదగ్న్య శబ్దము విశేషణమేయైనను బహుళ గ్రహణముచే రామశబ్దముతో సమసింపదు.

సూ : ఉపమానాని సామాన్యవచనైః 2-1-55

వృ : ఘన ఇవ శ్యామో ఘనశ్యామః

ఉపమానవాచకపదములు సమానాధికరణములగు సామాన్య (సమానధర్మ) వాచకపదములతో సమసించును.

ఘనశ్యామః : (మేఘమువలె నల్లనైనవాడు) ఇచట ఘనః అనునది ఉపమానవాచకము. ఇట ఉపమేయము కృష్ణుడు- ఉపమానోపమేయము లందున్న సమానధర్మము శ్యామత్వము కనుక ఘన అను ఉపమాన వాచక పదమునకు సమానాధికరణము, సమానధర్మ వాచకమునగు శ్యామ శబ్దముతో సమాసము. ఘన ఇవ శ్యామః అని లౌకికవిగ్రహము. ఘన + సు, శ్యామ + సు అలౌకిక విగ్రహ వాక్యము.

వా : శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోపస్యోపసంఖ్యానమ్ ఇది భాష్యవార్తికము. వర్ణో వర్ణేన.

శాకపార్థివః మున్నగు సమాసపదముల సిద్ధికై ఉత్తరపదమునకు లోపము చెప్పవలెను.

శాకః ప్రియః యస్య సః శాకప్రియః : (శాకము ప్రియముగాగల వాడు) శాకప్రియశ్చ అసౌ పార్థివశ్చ....శాకప్రియపార్థివః - వీనిలో మొదటిది బహువ్రీహి - రెండవది బహువ్రీహిగర్భిత తత్పురుషము. శాక ప్రియపార్థివ అనుచోట నీ వార్తికముచే 'శాకప్రియ' అను బహువ్రీహి లోని ఉత్తరపదమగు ప్రియ శబ్దమునకు లోపము రాగా శాకపార్థివః అని సిద్ధించును.

శాకప్రియపార్థివః అను సమాసమందలి మధ్యమపదమగు ప్రియ శబ్దమునకు లోపము వచ్చుటచే దీనిని మధ్యమపదలోపిసమాసమని యందురు.

దేవబ్రాహ్మణః :- దేవానాం పూజకః దేవపూజకః, దేవపూజ కశ్చాసౌ బ్రాహ్మణశ్చ దేవపూజక బ్రాహ్మణః. వీనిలో మొదటిది షష్ఠీ తత్పురుషము. రెండవది తత్పురుషగర్భితమగు కర్మధారయము. దేవ పూజక బ్రాహ్మణ అను కర్మధారయమున నీ వార్తికముచే తత్పురుష సమాసమందలి ఉత్తరపదమగు పూజకశబ్దమునకు లోపము రాగా దేవ బ్రాహ్మణః అను రూపము సిద్ధించును.

సూ: నఞ్ 2-2-6

వృ: నఞ్ సుపా సహ సమస్యతే.

నఞ్ సుబంతముతో సమసించును. నఞ్ స్వరాదుల యందును, నిపాతాదులయందును చేరుటచే నిది యవ్యయము. ఇది నిషేధార్థకము.

సాదృశ్యము, అభావము, అన్యత్వము, అల్పత్వము, అప్రాశస్త్యము, విరోధము అను ఆరు అర్థములు నఞర్థములని ప్రాచీనుల మతము.[1] అబ్రాహ్మణః, అపాపమ్, అనశ్వః, అనుదరా (కన్యా) అనశ్వః, అధర్మః అనునవి క్రమముగా ఈ అర్థములకుదాహరణములు.

సూ : నలోపో నఞః 6-3-73

వృ : నఞో నస్య లోప ఉత్తరపదే; న బ్రాహ్మణః అబ్రాహ్మణః

ఉత్తర పదము పరమగునపుడు నఞ్ లోని నకారమునకు లోపము వచ్చును.

అబ్రాహ్మణః: న బ్రాహ్మణః అని లౌకిక విగ్రహ వాక్యము. న + బ్రాహ్మణ + సు అను అలౌకిక విగ్రహ వాక్యమున 'నఞ్' అను సూత్రముచే నఞ్‌కు సుబంతముతో సమాసము. బ్రాహ్మణ శబ్ద ముత్తర పదముగా నుండుటచే నఞ్‌లోని 'న్'కు లోపము రాగా అబ్రాహ్మణ అని యగును.

సూ : తస్మాన్నుడచి 6-3-74

వృ : లుప్త నకారాన్నఞః ఉత్తరపదస్యా జాదేర్నుడాగమః స్యాత్; అనశ్వః, నైకధేత్యాదౌ తు నశబ్దేన సహ సుప్సుపేతి సమాసః

నకారము లోపించిన నఞ్‌కు పరమైన అజాదియగు ఉత్తర పదమునకు నుట్ ఆగమముగా వచ్చును. నుట్‌లోని టకార - ఉకారములు ఇత్సంజ్ఞకములై లోపింపగా 'న్' మిగులును.

---

1. తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా
అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః

అనశ్వః : న + అశ్వః అని లౌకిక విగ్రహ వాక్యము. న + అశ్వ సు అను అనలౌకిక విగ్రహ వాక్యమున 'నఞ్' అను సూత్రముచే సమాసము. సుబ్లోపము (న + అశ్వ) 'నలోపో నఞః' అను సూత్రముచే నకార లోపము (న + అశ్వ). లుప్త నకారమగు నఞ్‌కు పరమైన అశ్వ అను అజాదియగు ఉత్తర పదము పరమగుటచే నుడాగమము (అ + న్ + అశ్వ = అనశ్వ)

'నైకధా' ఇత్యాది' స్థలములలో అనశ్వః అను చోటవలెనే నఞ్ లోని నకారమునకు లోపము. నుడాగమము రాగా 'అనేకధా' అని మాత్రమే కావలసియున్నది. కాని నైకధా ఇత్యాది స్థలములలో పూర్వపద మగు 'న' నఞ్ కాదు. నిషేధార్థక మగు 'న' శబ్దము - కనుక ఇట 'నఞ్' అను సూత్రముచే కాక "సహ సుపా" అను సూత్రముచే సమాసము వచ్చును. అప్పుడు నఞ్ విషయమున విధింపబడిన 'నలోపో నఞః, తస్మాన్నుడచి' అను సూత్రములు ప్రవర్తింపవు. నైకధా అనియే అగును నఞ్‌తో సమాసము చెప్పిన పక్షమున నలోపము, నుడాగమమును వచ్చి 'అనేకధా' అను రూపము సిద్ధించును.

సూ : కుగతిప్రాదయః 2-2-1-8

వృ : ఏతే సమర్థేన నిత్యం సమస్యంతే; కుత్సితః పురుషః కుపురుషః.

కుత్సితార్థకమగు 'కు' అను అవ్యయమును, గతి సంజ్ఞకములును, ప్రాదులును సమర్థమగు పదముతో నిత్యముగ సమసించును. అది తత్పురుష సంజ్ఞకము.

కుపురుషః : కుత్సితః పురుషః అని లౌకికవిగ్రహవాక్యము. కు + పురుష + సు అను అలౌకిక విగ్రహ వాక్యమునకు అను అవ్య యము సమర్థమగు పురుషశబ్దముతో సమసించినది. సుబ్లోపము.

సాధారణముగ విగ్రహ వాక్యము లేనిది, లేక సమాస మందలి పదములు విగ్రహమున లేనిది (అస్వపద విగ్రహము) నిత్య సమాసమనబడును. "ప్రాయేణ అవిగ్రహః; అస్వపదవిగ్రహో వా నిత్య సమాసః" ఇది నిత్య సమాసమగుటచేతనే కుత్సితః పురుషః అని విగ్రహము చెప్పబడినది.

**సూ : ఊర్యాదిచ్విడాచశ్చ 1-4-61**

వృ : ఊర్యాదయశ్చ్వ్యన్తా డాజంతాశ్చ క్రియాయోగే గతిసంజ్ఞాః స్యుః; ఊరీకృత్య, శుక్లీకృత్య, పటపటాకృత్య, సుపురుషః

ఊరీ మున్నగు పదములును, చ్వి ప్రత్యయాంతములును, డాచ్ ప్రత్యయాంతములును క్రియాయోగమున గతిసంజ్ఞకములగును.

ఊరీకృత్య : ఊరీకృత్వా అని లౌ.వి.వా. అంగీకారార్థమగు ఊరీ అను అవ్యయమునకు కృధాతువుతో సంబంధముండుటచే నీ సూత్రముచే గతి సంజ్ఞ. దీనికి పూర్వసూత్రముచే సమర్థమగు కృత్వా అను పదముతో సమాసము. 'సమాసేఽనఞ్ పూర్వే క్త్వో ల్యప్' అను సూత్రముచే క్త్వాప్రత్య యమునకు ల్యప్ (య) ఆదేశము రాగా ఊరీకృత్య అని సిద్ధించును.

శుక్లీకృత్య : అశుక్లం శుక్లం కృత్వా (తెల్లగా లేనిదానిని తెల్లగా చేసి) అని యర్థము. శుక్లకృత్వా అనుచోట "కృభ్వస్తి యోగే సంపద్యకర్తరి చ్విః "అను సూత్రముచే శుక్లశబ్దమునకు అభూత తద్భావార్థ

మున (అట్లుకానిది అట్లైనది అను నర్థమున) చ్వి ప్రత్యయము - చ్వి ప్రత్యయము సర్వలోపి - "అస్య చ్వౌ" అను సూత్రముచే ఆకారమునకు ఈకారాదేశము (శుక్లీ + కృత్వా)చ్వి ప్రత్యయాంతమగు 'శుక్లీ' అనుదానికి కృధాతువుతో యోగముండుటచే గతిసంజ్ఞ - దీనికి కృత్వా అను సమర్థ పదముతో పూర్వ సూత్రముచే సమానము. "సమాసేஉనఞ్ పూర్వే" అను సూత్రముచే క్త్వా ప్రత్యయమునకు ల్యప్ ఆదేశము (శుక్లీ కృత్య)

పటపటా కృత్య (పటాపటా అనుశబ్దమును చేసి) పటత్ కృత్వా అనుచోట అవ్యక్త ధ్వన్యనుకరణ శబ్దమగు పటత్ శబ్దమునకు "అవ్యక్తాను కరణాద్ ద్వ్యజ వరార్థాదనితౌ డాచ్" అను సూత్రముచే డాచ్ ప్రత్యయము (డాచ్‌లో డకార చకారములితులై లోపింపగా 'ఆ' మాత్రమే మిగులును). 'డాచి ద్వే బహుళమ్' అను వార్తికముచే పటత్ అనుదానికి ద్విత్వము (పటత్ పటత్ ఆ కృత్వా) టిలోపము పటత్ + పట్ + ఆ + కృత్వా) 'నిత్యమామ్రేడితే డాచి' అను సూత్రముచే తకారపకారములకు ఆకారమేకాదేశమః (పటపటాకత్వా) ఇట పటపటా అను డా జంతమునకు కృధాతువుతో యోగముండుటచే గతిసంజ్ఞ కనుక పూర్వ సూత్రముచే పట పటా అను దానికి కృత్వా అను సమర్థ పదముతో సమాసము. "సమాసేஉనఞ్‌పూర్వే క్త్వో ల్యప్"అను సూత్రముచే క్త్వా ప్రత్యయమునకు ల్య బాదేశము (పటాపటకృత్య.)

సు పురుషః :- సు అనునది ప్రాదులలో చేరినది కావున దీనికి 'కుగతి ప్రాదయః' అను సూత్రముచే పురుష + సు అను సమర్థపదముతో సమాసము. సుబ్లోపము రాగా సుపురుష అనురూపమేర్పడును.

'కుగతిప్రాదయః' అను పూర్వ సూత్రమున ప్రాదులు సమర్థమగు పదముతో సమసించునని మాత్రమే తెలుపబడినది. అట్టి ప్రాదులు ఏయే అర్థములతో సమసించునో క్రింది ఐదు వార్తికములలో తెలుపబడినది.

వా :- ప్రాదయో గతాద్యర్థే ప్రథమయా

గత మున్నగు అర్థము లందున్న ప్రాదులు ప్రథమాంతముతో సమసించును.

ప్రాచార్యః :- ప్రగతః ఆచార్యః అని అస్వపద విగ్రహ వాక్యము; ప్రాచార్యః అను సమాసముననున్న ప్ర అను పదము విగ్రహ వాక్యమున లేనందున నిది నిత్య సమాసము). ప్ర అనుదానికి గత అను ప్రథమాంతముతో 'కు గతిప్రాదయః అను సూత్రముచే సమాసము రాగా ప్రాచార్యః అని యగును.

వా : అత్యాదయః క్రాంతాద్యర్థే ద్వితీయయా

క్రాంతమున్నగు నర్థములందున్న అతి మున్నగునవి ద్వితీయాంత పదముతో సమసించును.

అతిమాలః : (మాలనతిక్రమించినవాడు) క్రాంతః మాలాం అని అస్వపద విగ్రహము-అతిమాలా + అమ్ అని యుండగా క్రాంతార్థకమగు అతి అనుదానికి మాలా + అమ్ అను ద్వితీయాంతముతో 'కుగతి ప్రాదయః' అను సూత్రముచే సమాసము. సుబ్లోపము రాగా అతిమాలా అని కాగా

సూ : ఏకవిభక్తిచాపూర్వనిపాతే 1-2-44

వృ : విగ్రహే యన్నియతవిభక్తికం తదుపసర్జనసంజ్ఞం స్యాన్నతు తస్య పూర్వనిపాతః

విగ్రహవాక్యమున నియతముగా ఒకే విభక్తి యందుండునది ఉపసర్జనసంజ్ఞకమగును. కాని 'ఉపసర్జనం పూర్వమ్' అను సూత్రముచే వచ్చుదానికి పూర్వనిపాతము రాదు.

మాలామ్ అతిక్రాంతః ఇత్యాదివిగ్రహవాక్యములలో 'మాలామ్' అనునది ఎల్లప్పుడు ద్వితీయాంతముగానే యుండును. అతిక్రాంత శబ్దము మాత్రము మాలాం అతిక్రాంతం, మాలాం అతిక్రాంతేన ఇత్యాది విగ్రహస్థలములలో ద్వితీయాది విభక్త్యంతములుగ మారవచ్చును. కనుక అతిక్రాంత యనునది నియతవిభక్తికము కాదు. మాలాం అనునది నియతవిభక్తికము. దానికీ సూత్రముచే ఉపసర్జన సంజ్ఞ. ఉపసర్జన సంజ్ఞా ప్రయోజన మీ క్రింది సూత్రమున తెలుపబడుచున్నది.

సూ : గోస్త్రియోరుపసర్జనస్య 1-2-48

వృ : ఉపసర్జనం యో గోశబ్దః, స్త్రీ ప్రత్యయాంతం చ తదంతస్య ప్రాతిపదికస్య హ్రస్వః స్యాత్; అతిమాలః

ఉపసర్జనమగు గోశబ్దమునకును, ఉపసర్జనమగు స్త్రీప్రత్యయాంత ప్రాతిపదికమునకును హ్రస్వము వచ్చును.

అతి + మాలా అనుచోట మాలా అనునది ఉపసర్జనమగు స్త్రీ ప్రత్యయాంత (టాప్ ప్రత్యయాంత) ప్రాతిపదికమగుటచే ఈ సూత్రముచే హ్రస్వము రాగా 'అతిమాల' అని యగును.

ఇట్లే అతిఖట్వః (ఖట్వాం అతిక్రాంతః) ఇత్యాదుల యందు హ్రస్వము.

"రాజకుమారీ" ఇత్యాది షష్ఠీ తత్పురుషములయందు 'కుమారీ' శబ్దము స్త్రీ ప్రత్యయాంతప్రాతిపదికమైయైనను నియతవిభక్తికము కాక పోవుటచే ఉపసర్జనము కాదు కనుక ఈ సూత్రముచే హ్రస్వము రాదు.

వా : అవాదయః కృష్టాద్యర్థే చతుర్థ్యా

కృష్టాద్యర్థములను తెలుపు 'అవ' మున్నగునవి చతుర్థ్యంతముతో సమసించును.

అవకోకిలః : అవ కృష్టః కోకిలయా (కోకిలచే తెలుపబడినది-వసంతము) అని లౌకిక విగ్రహము.

కృష్టార్థకమగు 'అవ' అను దానికి కుగతి ప్రాదయః అను సూత్రముచే సమాసము. కోకిలా శబ్దము 'ఏక విభక్తి' అను సూత్రముచే ఉపసర్జన సంజ్ఞకమగుటచే 'గోస్త్రియోరుప....' అనుసూత్రముచే హ్రస్వము రాగా 'అవకోకిల' అని యగును.

వా : పర్యాదయో గ్లానాద్యర్థే చతుర్థ్యా

గ్లానాద్యర్థములను బోధించు పరి మున్నగునవి చతుర్థ్యంత పదముతో సమసించును.

పర్యధ్యయనః : (పర్యధ్యయన అంటే అలసిపోయినవాడు)పరిగ్లానః అధ్యయనాయ అని లౌకిక విగ్రహ వాక్యము. పరి + అధ్యయన + ఙే అనుచోట గ్లానార్థకమగు పరి అను దానికి చతుర్థ్యంతమగు అధ్యయన శబ్దముతో సమాసము. సుబ్లోపము, యణాదేశము రాగా 'పర్యధ్యయన' అని యగును.

వా : నిరాదయః క్రాంతాద్యర్థే పంచమ్యా

క్రాంతాద్యర్థములను బోధించు నిర్ మొదలగునవి పంచమ్యంత పదములతో సమసించును.

నిష్కౌశాంబిః : (కౌశాంబి నుండి నిర్గమించినవాడు) నిష్క్రాంతః కౌశాంబ్యాః అని లౌకిక విగ్రహ వాక్యము. నిర్ + కౌశాంబీ + ఙసి అను అలౌకిక విగ్రహ వాక్యమున క్రాంతార్థకమగు నిర్ అను దానికి కౌశాంబీ + ఙసి అను పంచమ్యంతముతో "కుగతిప్రాదయః" అను సూత్రముచే సమాసము. సుబ్లోపము. కౌశాంబీ శబ్దమునకు "ఏక విభక్తి...." అను సూత్రముచే ఉపసర్జన సంజ్ఞయు, "గోస్త్రియో" అను సూత్రముచే హ్రస్వమును రాగా నిష్కౌశాంబి అను రూపము సిద్ధించును.

**సూ : తత్రోపపదం సప్తమీస్థమ్ 3-1-91**

వృ : సప్తమ్యంతే పదే కర్మణీత్యాదౌ వాక్యత్వేన స్థితం యత్కుంభాది తద్వాచకం పదముపపదసంజ్ఞం స్యాత్.

ఇది ధాతోః అను నధికార సూత్రమునకు తరువాతనున్న అధికార సూత్రము. సప్తమ్యంత పదమునందు వాచ్యవాచక సంబంధముతో నున్నది అని అర్థము. అనగా సప్తమ్యంతపద వాచ్యమని భావము. "ధాతోః" అను నధికార సూత్రాంతర్గతములగు "కర్మణ్యణ్" ఇత్యాది సూత్రములతో సప్తమ్యంతపదముచే వాచ్యమగు కుంభాదికమును తెలుపు పదము ఉపపద మనబడునని సూత్రార్థము. అట్టి ఉపపదము సమీపమున నున్నపుడు మాత్రమే చెప్పబోవు ఆయా ప్రత్యయములు వచ్చును. 'కుంభం కరోతి' అను నర్థము కర్మణ్యణ్ అను సూత్రమునందలి కర్మణి అను సప్తమీ పదముచే వాచ్యమగునది. కుంభము - తద్వాచకమగు కుంభశబ్దమిచ్చట ఉపపదసంజ్ఞకము.

**సూ : ఉపపదమతిఙ్ 2-2-19**

వృ : ఉపపదం సుబంత సమర్థేన నిత్యం సమస్యతే, అతిఙంత శ్చాయం సమాసః; కుంభం కరోతీతి కుంభకారః. అతిఙ్ కిమ్? మా భవాన్ భూత్: మాఙి లుఙి'తి సప్తమీనిర్దేశాన్మాఙుపపదమ్.

ఉపపద సంజ్ఞకమగు సుబంతము సమర్థముతో సమసించును. ఈ సమాసము తిఙంతము కాఙాలదు.

కుంభకారః : (కుండలను చేయువాడు) కుంభం కరోతి అను నర్థమున కర్మవాచకమగు కుంభ శబ్దముపపదముగా నుండుటచే కృధాతువుపై కర్త్రర్థమున 'కర్మణ్యణ్' అను సూత్రముచే అణ్ ప్రత్యయము. పిదప వృద్ధి రాగా 'కార' అని యగును. కుంభ + అమ్ + కార అని లౌకిక విగ్రహవాక్యము. ఇట 'తత్రోప పదమ్' అను సూత్రముచే కుంభ + అస్ అనుదానికి కార అను సమర్థముతో నీ సూత్రముచే సమాసము. సుబ్లోపము రాగా 'కుంభకార' అని యగును.

కార అను కృత్ప్రత్యయాంతముతో యోగముండుటచే "కర్తృకరణయోః కృతి" అను సూత్రముచే కుంభ శబ్దముపై షష్ఠీవిభక్తియే వచ్చుటచే కుంభ + అమ్ + కార అని అలౌకికవిగ్రహము చెప్పుట తప్పు. కుంభం కరోతి అనునది అర్థప్రదర్శనము మాత్రమే.

ఈ సమాసము తిఙంతముతో రాదు (అతిఙ్) అని చెప్పుటచే, 'మా భవాన్ భూత్' అనుచోట 'మా' అనుదానికి భూత్ అను తిఙంతముతో సమాసము రాలేదు. 'మాఙి లుఙ్' అను సూత్రమందలి 'మాఙి' అను సప్తమ్యంత పదముచే వాచ్యమగుటచే మాఙ్‌నకు "తత్రోపపదం" అను సూత్రముచే ఉపపద సంజ్ఞ వచ్చును. ఉపపదము సమర్థముతో సమ

సించును అని మాత్రమే చెప్పిన మా భవాన్ భూత్ అనుచోట ఉపపద సంజ్ఞకమగు 'మా' అనుదానికి 'భూత్' అనుదానితో సమాసము వచ్చెడిది. తిజంతముతో రాదు అని చెప్పుటచే భూత్ అను తిజంతముతో ఉపపదమైనను మాఙ్‌నకు సమాసము రాదు. ఇట సమాసము రాదని తెలియజేయుటకే రెండింటి నడుమ భవాన్ అను పదము ప్రయోగింపబడినది.

ప. గతికారకోపపదానాం కృద్భిః సహ సమాసవచనం ప్రాక్సుబుత్పత్తేః; వ్యాఘ్రీ, అశ్వక్రీతీ, కచ్ఛపీత్యాది.

గతి సంజ్ఞకము, కారకము, ఉపపదము - వీనికి కృదంతముతో వచ్చు సమాసము కృదంతముపై సుబుత్పత్తికి పూర్వమే వచ్చును.

వ్యాఘ్రీ :- వ్యాజిఘ్రతి (విశేషముగ వాసన చూచునది) ఇతి వ్యాఘ్రః. వి, ఆఙ్ అను ఉపసర్గలు పూర్వమందు గల 'ఘ్రా' ధాతువుపై 'ఆతశ్చోపసర్గే' కః అను సూత్రముచే 'క' (అ) ప్రత్యయము (వి + ఆ + ఘ్రా + అ) 'ఆతో లోప ఇటి చ' అను సూత్రముచే ఆకార లోపము. (వి + ఆ + ఘ్ర + అ) ఆఙ్‌కు ఘ్రశబ్దముతో ఉపపద సమాసము. వి అను గతిసంజ్ఞకమునకు ఆఘ్ర అను సమర్థముతో గతిసమాసము. ఇట 'వి' అను గతిసంజ్ఞకము కృదంతమగు ఆఘ్రశబ్దముపై సుప్ ప్రత్యయము చేరకముందే సమసించునని ఈ వార్తికము చెప్పుచున్నది. కనుక నిట ఆఘ్ర అను కృదంతమగు కేవల ప్రాతిపదికముతోనే 'వి' అను గతిసంజ్ఞకమునకు సమాసము. కాని కృదంతమునకు సుప్ ప్రత్యయము చేరకముందే గతిసంజ్ఞకమునకు సమాసము చెప్పినచో "స్వార్థద్రవ్యలింగ సంఖ్యాకారక ప్రయుక్త కార్యాణాం క్రమికత్వమ్" (ద్రవ్యములు, లింగము, సంఖ్య, కారకము—వీనికి సంబంధించిన కార్యములు క్రమముగా

వచ్చును) అను భాష్యవచనానుసారము కారకప్రయుక్తకార్యమగు సుబుత్పత్తికి పూర్వము లింగము, లింగప్రయుక్తకార్యము ముందు రావలసియున్నది. అట్లైనచో వి + అఘ్ర అనుచోట 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే స్త్రీ ప్రత్యయమగు టాప్ వచ్చి, వి + అఘ్రా అని యగును. పిదప సుబుత్పత్తి ఏర్పడిన పిదప గతిసమాసము వచ్చినచో "వ్యాఘ్రా" అను అనిష్టరూప మేర్పడును. సమాసము రాకపూర్వము "అఘ్ర" అనునది జాతివాచకము కానందున టాప్‌కు బదులుగ "జాతేరస్త్రీ విషయాదయోపధాత్" అను సూత్రముచే ఙీష్ వచ్చుట కవకాశము లేదు. కనుక అఘ్ర శబ్దముపై సుబుత్పత్తి జరుగకమునుపే 'వి' అను గతిసంజ్ఞకమునకు 'అఘ్ర' అను ప్రాతిపదికముతో సమాసము రాగా 'వ్యాఘ్ర' అని యగును. ఇది జాతివాచకమగుటచే 'జాతేరస్త్రీ' అను సూత్రముచే ఙీష్ వచ్చి వ్యాఘ్రీ అని యగును.

అశ్వక్రీతీ : అశ్వేన క్రీతా (గుర్రముచే కొనబడినది) అని లౌకిక విగ్రహవాక్యము. ఇది కారకసమాసము. ఇట అశ్వ + టా అను తృతీయాంతమునకు క్రీత అను క్త ప్రయాంతముతో సుప్ ప్రత్యయము చేర్చుటకు పూర్వమే అనగా క్రీత అను కేవల ప్రాతిపదికముతో 'కర్తృకరణే కృతా బహుళమ్' అను సూత్రముచే సమాసము. సుబ్లోపము రాగా అశ్వక్రీత అను ప్రాతిపదిక మేర్పడగా, "క్రీతాత్కరణ పూర్వాత్" అను సూత్రముచే అశ్వ అను కరణ వాచక శబ్దము పూర్వమునందుండుటచే క్రీతశబ్దముపై ఙీష్ (ఈ) వచ్చి అశ్వక్రీతీ అని యగును. ఈ వార్తికము ప్రకారము క్రీత శబ్దముపై సుప్ ప్రత్యయము చేరకమునుపే సమాసము వచ్చునని చెప్పనిచో పూర్వోదాహరణము నందువలె అదంతమగుటచే క్రీత శబ్దముపై మొదటనే టాప్ వచ్చి క్రీతా అని యగును. పిదప సుప్పు చేర్చి అశ్వశబ్దముతో సమాసము చేయగా అశ్వక్రీతా అనియే యగును. సమా

సము చేయక పూర్వము కరణ పూర్వకము కాని స్వతంత్రమగు క్రీత శబ్దమునకు 'క్రీతాత్ కరణపూర్వాత్' అను సూత్రముచే మొదట జీష్ వచ్చుట కవకాశము లేదు. టాప్ ప్రత్యయము వచ్చిన పిదప సుబంతమగు క్రీతా శబ్దముతో అశ్వ శబ్దమునకు సమాసము రాగా కరణ పూర్వకమైనను క్రీతాశబ్దము అదంతము కాకపోవుటచే "క్రీతాత్ కరణ పూర్వాత్" అను సూత్రముచే జీష్ ప్రత్యయము రాకుండును. కనుక కారకమునకు కృదంతముతో సుప్ ప్రత్యయము చేర్చుటకు పూర్వమే సమాసము వచ్చునని చెప్పవలెను.

కచ్ఛపీ : కచ్ఛేన పిబతి లేక కచ్ఛే వా పిబతి (తాబేలు) అని లౌ.వి. కచ్ఛమనగా తీరము. సుపి స్థః అను సూత్రమును యోగ విభాగము చేయగా ఏర్పడిన సుపి అను సూత్రమువలన సుబంతమగు కచ్ఛ శబ్దము (కచ్ఛ + టా, లేక కచ్ఛ ఙి) ఉపపదముగా నుండుటచే "పాధాతువుపై 'క' ప్రత్యయము. 'ఆ'లోపము రాగా" 'ప' అని యగును. ఇట 'ప' అను కృదంతముపై సుబుత్పత్తి కాకపూర్వమే కచ్ఛ + టా లేక కచ్ఛ + ఙి అను సుబంతముతో సమాసము. (ఇది ఉప పద సమాసము) కచ్ఛప అను సమాసము జాతివాచకము కావున "జాతేర స్త్రీ...." అను సూత్రముచే జీష్ (ఈ) రాగా కచ్ఛపీ అని యగును. సమాసము చేయుటకు పూర్వమే 'ప' అను కృదంతముపై సుప్ ప్రత్యయము చేర్చుచో వ్యాఘ్రీ అనుచోటవలె సుప్ ప్రత్యయమునకు పూర్వమే స్త్రీ ప్రత్యయము చేర్చవలసియుండును. సమాసము రాకపూర్వము వ్యస్తముగా స్వతంత్రముగా నున్న 'ప' అను కృదంతము జాతివాచకము కానందున" జాతేరస్త్రీ" అను సూత్రముచే జేష్ వచ్చుట కవకాశము లేదు. అదంతమగుటచే టాప్ ప్రత్యయమే వచ్చి 'కచ్ఛపా' అను అనిష్టరూప మేర్పడియుండును.

కనుక వ్యాఘ్రీ ఇత్యాది గతిసమాసములందు అశ్వక్రీతీ ఇత్యాది కారక సమాసములందు, కచ్ఛపీ ఇత్యాది 'ఉపపదసమాసములందు' కృదంతముపై సుప్ ప్రత్యయము రాకపూర్వమే సమాసము చెప్ప వలెను.

సూ : తత్పురుషస్యాంగుళేః సంఖ్యావ్యయాదేః 5-1-86

వృ : సంఖ్యావ్యయాదేరంగుళ్యంతస్య సమాసాంతోఽచ్ స్యాత్. ద్వే అంగుళీ ప్రమాణమస్య ద్వ్యంగుళమ్; నిర్గతమంగుళిభ్యో నిరంగుళమ్,

సంఖ్యావాచకములు లేక అవ్యయములు ఆదియందుగల తత్పురుషములపై సమాసాంతమగు అచ్ ప్రత్యయము వచ్చును.

ద్వ్యంగుళమ్ : ద్వే అంగుళీ ప్రమాణమస్య (రెండంగుళుల ప్రమాణము కలది) అని లౌకికవిగ్రహ వాక్యము. ద్వి + ఔ + అంగుళి + ఔ అను అలౌకికవిగ్రహ వాక్యమున తద్ధితార్థమగు ప్రమాణార్థమున 'తద్ధితార్థోత్తర....' అను సూత్రముచే సమాసము. ప్రమాణార్థమున వచ్చిన మాత్రచ్ ప్రత్యయమునకు[1] లోపము. పిదప సుబ్లోపము రాగా ద్వి + అంగుళి = ద్వ్యంగుళి అని యగును. ఇది సంఖ్యా వాచకాదియు అంగుళ్యంతమును అగు తత్పురుషమగుటచే ఈ సూత్రముచే అచ్ ప్రత్యయము (ద్వ్యంగుళి + అ) యస్యేతి చ అను సూత్రముచే ఇకార లోపము (ద్వ్యంగుళ్ + అ = ద్వ్యంగుళ) నపుంసకలింగ ప్రథమైకవచనమున ద్వ్యంగుళమ్ అని యగును.

---

1. ప్రమాణే....మాత్రచః ఈ సూత్రముచే ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్ అను ప్రత్యయములు ప్రమాణార్థమున విధింపబడినవి.

నిరంగుళమ్ : నిర్గతం అంగుళిభ్యః అని లౌకిక - అస్వపద విగ్రహము. గతార్థకమగు నిర్ అనుదానికి పంచమ్యంతమగు అంగుళి శబ్దముతో "నిరాదయః క్రాంతాద్యర్థే పంచమ్యా" అనువార్తికసహకృతమగు 'కుగతిప్రాదయః' అను సూత్రముచే సమాసము. సుబ్లోపము రాగా 'నిరంగుళి' అని యగును. ఇది అవ్యయాదియు, అంగుళ్యంతమును అగు తత్పురుషమగుటచే ఈ సూత్రముచే సమాసాంతమగు అచ్ ప్రత్యయము (నిరంగుళి + అ) 'యస్యేతి చ' అను సూత్రముచే ఇకార లోపము (నిరంగుళ్ + అ) రాగా నిరంగుళ అను ప్రాతిపదికము సిద్ధించును.

**సూ: - అహః సర్వైకదేశసంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః 5-4-87**

వృ:- ఏభ్యో రాత్రే రచ్ స్యాచ్చాత్సంఖ్యావ్యయాదేః అహర్గ్రహణం ద్వంద్వార్థమ్.

అహన్, సర్వ, ఏకదేశ వాచక (అవయవ) సంఖ్యాత, పుణ్య శబ్దములు పూర్వమందుగల రాత్రి శబ్దము పైనను, సంఖ్యావాచకములు, అవ్యయములు పూర్వమందుగల రాత్రి శబ్దము పైనను తత్పురుషమున సమాసాంతమగు అచ్ ప్రత్యయము వచ్చును.

అహ్నః రాత్రిః : (పగటి రాత్రి) అను అహన్శబ్దపూర్వక షష్ఠీ తత్పురుషమును, అహశ్చాసౌ రాత్రిశ్చ (పగలైన రాత్రి) అను అహన్ శబ్దపూర్వక కర్మధారయమును ఉండుట కవకాశము లేదు కనుక ఈ సూత్రమున అహన్ శబ్దపూర్వక ద్వంద్వసమాసమునే (అహశ్చ రాత్రిశ్చ అనుదానిని) గ్రహింపవలెను. ఈ సూత్రోదాహరణములప్రక్రియ క్రింది సూత్రమున చూపబడును.

సూ :- రాత్రాహ్నాహాః పుంసి  2-4-29

వృ:- ఏతదంతౌ ద్వంద్వ తత్పురుషౌ పుంస్యేవ; అహశ్చ రాత్రిశ్చా హో రాత్రః, సర్వ రాత్రః, సంఖ్యాత రాత్రః

రాత్ర, అహన్, అహ అను శబ్దములు అంతమందు గల ద్వంద్వ తత్పురుషములు పుంలింగమున నుండును.

అహో రాత్రః (రాత్రి మరియు పగలు) అహశ్చ రాత్రిశ్చ తయోః సమాహారః అని లౌకిక విగ్రహము. ద్వంద్వసమాసమున వచ్చిన పిదప అహోరాత్రి అని యుండగా 'అహః సర్వైక' అను సూత్రముచే అచ్ ప్రత్యయము (అహో రాత్రి + అ) - యస్యేతి చ అను సూత్రముచే ఇకారలోపము. (అహో రాత్ + అ) ఇది రాత్రి శబ్ద మంతమందు గల ద్వంద్వ మగుటచే ఈ సూత్రముచే పుంలింగము రాగా అహోరాత్రః అని యగును.

సర్వరాత్రః : (పూర్తి రాత్రి) సర్వా చాసా రాత్రిశ్చ అని విగ్రహము. కర్మధారయ సమాసము వచ్చి సర్వ రాత్రి అని యగును. ఇట రాత్రి శబ్దము సర్వ శబ్దమునకు పరమందుండుటచే రాత్రి శబ్దముపై అహః సర్వైకదేశ అను పూర్వ సూత్రముచే 'అచ్' ప్రత్యయము (సర్వ రాత్రి + అ) ఇకార లోపము (సర్వరాత్ర) ఇది రాత్రి శబ్దమంత మందు గల సమానాధికరణ తత్పురుషమగుటచే నీ సూత్రముచే పుంలింగము రాగా సర్వరాత్రః అని యగును.

పూర్వ రాత్రః : (పూర్వం రాత్రేః) అపరరాత్రః (అపరం రాత్రేః) అనుచోట్ల పూర్వ, అపర అను అవయవవాచకములు పూర్వమందుండుటచే

రాత్రి శబ్దముపై 'అహస్సర్వైకదేశ' అను పూర్వ సూత్రముచే అచ్ ప్రత్యయము, ఈ సూత్రముచే పుంలింగము.

సంఖ్యాతరాత్రః : సంఖ్యాతా చ సా రాత్రిశ్చ అని లౌకిక విగ్రహము. 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అను సూత్రముచే సమాసము, పూర్వ సూత్రముచే అచ్ ప్రత్యయమును, ఈ సూత్రముచే పుంలింగమును రాగా సంఖ్యాతరాత్రః అని సిద్ధించును.

వా : సంఖ్యాపూర్వం రాత్రం క్లీబమ్; ద్విరాత్రమ్ త్రిరాత్రమ్.

సంఖ్యావాచకశబ్దము పూర్వమందుగల రాత్రి శబ్దము నపుంసక లింగమున నుండును.

ద్విరాత్రమ్ : ద్వయోః రాత్ర్యోః సమాహారః అని విగ్రహము. 'తద్ధితార్థోత్తరపద సమాహారే చ' అను సూత్రముచే సమాసము రాగా ద్విరాత్రి అని యగును. ఇది సంఖ్యావాచకము పూర్వమందుగల సమాసమగుటచే సంఖ్యావ్యయాదేః అను పదమనువర్తించిన 'అహః సర్వైకదేశ.... రాత్రేః' అను సూత్రముచే రాత్రి శబ్దముపై అచ్ ప్రత్యయము (ద్వి+ రాత్రి+అ), 'యస్యేతి చ' అను సూత్రముచే ఇకారలోపము (ద్వి+ రాత్+అ=ద్విరాత్ర) 'రాత్రాహ్నాహాః పుంసి' అను సూత్రముచే పుంలింగము ప్రాప్తించగా ఈ వార్తికముచే నపుంసకలింగము రాగా ద్విరాత్రమ్ అని యగును.

త్రిరాత్రమ్ : తిసృణాం రాత్రీణాం సమాహారః అని విగ్రహము. ప్రక్రియ 'ద్విరాత్రమ్' అనుదాని వలెనే.

అహ న్శబ్దమంతమందుగల ద్వ్యహ ఇత్యాదులును 'రాత్రాహ్నాహాః పుంసి, అను సూత్రముచే పుంలింగముననే యుండును.

సూ : రాజాహస్సఖిభ్యష్టచ్ 5-4-91

వృ : ఏతదంతాత్తత్పురుషాట్టచ్ స్యాత్; పరమరాజః

రాజన్, అహన్, సఖి, అను శబ్దములు అంతమందుగల తత్పురుష సమాసముపై టచ్ (అ) ప్రత్యయము వచ్చును. పరమరాజః (శ్రేష్ఠుడైన రాజు) పరమశ్చాసౌ రాజా చ అని విగ్రహము. విశేషణం విశేష్యేణ బహుళమ్ అను సూత్రముచే సమాసమురాగా పరమరాజన్ అని యగును.

ఇది రాజన్ శబ్దాంతమగు తత్పురుషమగుటచే ఈ సూత్రముచే టచ్ (అ) సమాసాంతముగ వచ్చి వరమరాజన్ + అ అని యగును. నస్తద్ధితే అను సూత్రముచే టి యగు అన్ కు లోపమురాగా పుంలింగ ప్రథమైకవచనమున పరమరాజః అని యగును.

ఇట్లే పుణ్యాహన్, రాజసఖి ఇత్యాది శబ్దములపై ఈ సూత్రముచే టచ్ ప్రత్యయము రాగా పుణ్యాహః, రాజసఖః ఇత్యాది రూపములు సిద్ధించును.

సూ : ఆన్మహతః సమానాధికరణజాతీయయోః 6-4-46

వృ : మహత ఆకారోఽంతాదేశః స్యాత్సమానాధికరణే ఉత్తర పదే జాతీయే చ పరే; మహారాజః, ప్రకార వచనే జాతీయర్; మహా జాతీయః

మహత్ శబ్దమునకు సమానాధికరణమగు ఉత్తరపదము పరమగు నపుడును, జాతీయర్ ప్రత్యయము పరమగునపుడును 'ఆ' కారమంతా దేశముగ వచ్చును.

మహారాజః (గొప్పరాజు) మహాన్ చ అసౌ రాజా చ అని లౌకిక విగ్రహ వాక్యము. 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అను సూత్రముచే మహత్ శబ్దమునకు రాజన్ శబ్దముతో సమాసము. మహత్ + రాజన్ అని యుండగా సమానాధికరణమగు రాజన్ శబ్దమునకు అంతాదేశముగా (తకారమున కాదేశముగ) ఆ కారము రాగా మహ + ఆ + రాజన్ అని కాగా సవర్ణదీర్ఘముచే మహారాజన్ అని యగును. 'రాజా హస్సఖిభ్యష్టచ్' అను సూత్రముచే టచ్ ప్రత్యయము (మహారాజ్ + అ)ను, నస్తద్ధితే అను సూత్రముచే టి(అన్) లోపము (మహారాజ్ + అ)ను, రాగా పుంలింగ ప్రథమైకవచనమున మహారాజః అని సిద్ధించును.

మహాజాతీయః : 'ప్రకారవచనే జాతీయర్' అను సూత్రముచే ఆ ప్రకారము (పద్ధతి) కలవాడు అను నర్థమున మహత్ శబ్దముపై జాతీయర్ (జాతీయ) ప్రత్యయము. (మహత్ + జాతీయర్) జాతీయర్ ప్రత్యయము పరమగుటచే నీ సూత్రముచే మహత్ శబ్దమున కాకారము అంతాదేశము. (మహా + ఆ + జాతీయ) సవర్ణదీర్ఘము రాగా మహాజాతీయః అని యగును.

సూ : ద్వ్యష్టనః సంఖ్యాయామబహువ్రీహ్యశీత్యోః 6-3-47

వృ : ఆత్స్యాత్; ద్వౌ చ దశ చ ద్వాదశ; అష్టావింశతిః.

ద్వి, అష్టన్ అను శబ్దములకు సంఖ్యా వాచకము ఉత్తరపదముగ నున్నప్పుడు ఆకారమంతాదేశముగ వచ్చును. ఈ ఆకారాంతాదేశము బహువ్రీహియందును, అశీతి శబ్దము ఉత్తరపదముగ నున్నప్పుడును రాదు.

ద్వాదశ : (పంౘెండు) ద్వౌ చ దశ చ అని ద్వంద్వమును లేదా ద్వ్యధికా దశ అని తత్పురుషమును చెప్పవచ్చును. ద్విదశన్ అనుచోట ద్విశబ్దమునకు దశ అను సంఖ్యావాచక ముత్తర పదముగ నుండుటచే ఆ కారమంతాదేశముగా (ఇకారమునకాదేశముగ) రాగా ద్వాదశ అని యగును.

అష్టావింశతిః : అష్టౌ (అష్ట) చ వింశతిః చ అను ద్వంద్వమును లేదా అష్టాధికా వింశతిః అని తత్పురుషమును చెప్పవచ్చును. అష్టన్ దశ అనుచోట అష్టన్‌శబ్దమునకు సంఖ్యావాచకము పరమగుటచే ఈ సూత్రముచే ఆ కారము అంతాదేశముగ (నకారము నకాదేశముగా) రాగా అష్ట + ఆ + దశ అని యగును. పిమ్మట సవర్ణదీర్ఘము వచ్చి అష్టాదశ అని సిద్ధించును.

సూ :- పరవల్లిఙ్గం ద్వంద్వతత్పురుషయోః 2-4-26

వృ:- ఏతయోః పరపదస్యేవ లిఙ్గం స్యాత్. కుక్కుటమయూర్యావిమే. మయూరీకుక్కుటావిమౌ, అర్ధపిప్పలీ.

ద్వంద్వ సమాసమునను, తత్పురుష సమాసమునను ఉత్తర పదమునకు ఏ లింగముండునో ఆ లింగమే మొత్తము సమాసమున కుండును.

కుక్కుట మయూర్యౌ: (ఇమే) కుక్కుటశ్చ మయూరీ చ కుక్కుట మయూర్యౌ. ఇది ద్వంద్వము. ఇట ఉత్తర పదమగు మయూర శబ్దము స్త్రీలింగమగుటచే మొత్తము సమాసమునకు స్త్రీలింగము వచ్చి 'కుక్కుట మయూర్యౌ' అని యగును. ఇది స్త్రీలింగరూపమని తెలుపుట కిట 'ఇమే' అను స్త్రీలింగశబ్దము ప్రయోగింపబడినది.

మయూరీకుక్కుటౌ (ఇమౌ) మయూరీ చ కుక్కుటశ్చ మయూరీ కుక్కుటౌ; ఇది ద్వంద్వము. ఇట ఉత్తర పదమైన కుక్కుట శబ్దము పుంలింగమగుటచే మొత్తము సమాసమునకు పుంలింగము రాగా మయూరీ కుక్కుటౌ అని యగును. ఇమౌ అనునది పుంలింగద్యోతకము.

అర్ధ పిప్పలీ :- అర్ధం పిప్పల్యాః అర్ధ పిప్పలీ - ఇది తత్పురుషము. ఇట ఉత్తర పదమగు పిప్పలీ శబ్దము స్త్రీలింగమగుటచే సమాసమునకును స్త్రీలింగమే వచ్చి అర్ధ పిప్పలీ అను రూపము సిద్ధించును.

వా :- ద్విగుప్రాప్తాపన్నాలంపూర్వగతిసమాసేషు ప్రతిషేధో వాచ్యః.

పంచసు కపాలేషు సంస్కృతః పంచకపాలః పురోడాశః

ద్విగుసమాసమునందును, ప్రాప్త-ఆపన్న - అలం అను పదములు పూర్వపదములుగా నున్న సమాసము లందును, గతి సమాసము లందును పూర్వ సూత్రముచే విధింపబడిన పరవల్లింగము (ఉత్తర పదముయొక్క లింగము)నకు నిషేధము చెప్పవలెను. అనగా ఇట్టి సమాసములందు సమాసపదము యొక్క లింగము ఉత్తర పదము యొక్క లింగము నను సరించి యుండదని తాత్పర్యము.

పంచకపాలః (పురోడాశః) పంచసు కపాలేషు సంస్కృతః అని లౌకిక విగ్రహవాక్యము. 'తద్ధి తార్థోత్త .... చ' అను సూత్రముచే సమాసము. ఇది ద్విగు సమాసము. ద్విగుసమాసమును తత్పురుష భేదమే యగుటచే 'పరవల్లింగం........' అను పూర్వసూత్రముచే పరవల్లింగ మగు (పరపదమైన కపాలశబ్దలింగమగు) నపుంసక లింగము సమాస మున ప్రాప్తించుచుండగా నీ వార్తికముచే పరవల్లింగ నిషేధము రాగా

పురోడాశః అను విశేష్యమునననుసరించి పుంలింగమే వచ్చి పంచ కపాలః అని సిద్ధించినది. తక్కిన యుదాహరణములు క్రిందిసూత్రమున చూపబడు చున్నవి.

సూ : ప్రాప్తాపన్నే చ ద్వితీయయా 2-2-4

వృ : సమస్యేతే. అకారశ్చానయోరంతాదేశః, ప్రాప్తో జీవికాం ప్రాప్తజీవికః, ఆపన్నజీవికః, అలం కుమార్యై అలంకుమారిః; అత ఏవ జ్ఞాపకాత్సమాసః నిష్కౌశాంబిః

ప్రాప్త, ఆపన్న అను శబ్దములు ద్వితీయాంతముతోడను సమసించును. సూత్రము నందలి చ అను శబ్దము వలన 'ద్వితీయా .... ప్రాప్తాపన్నైః' అను సూత్రముచే ద్వితీయాసమాసమును వచ్చునని భావము.

ప్రాప్త జీవికః : ప్రాప్తః జీవికామ్ అని లౌ.వి.వా. ప్రాప్త + సు + జీవికా + అమ్ అని యుండగా ఈ సూత్రముచే ప్రాప్త శబ్దమున కుపసర్జన సంజ్ఞయుండుటచే పూర్వ నిపాతము. సుబ్లోపము (ప్రాప్త జీవికా) గోస్త్రి యోరుప సర్జనస్య అను సూత్రముచే హ్రస్వము రాగా ప్రాప్త జీవిక అని యగును. ఇట 'పరవల్లింగం .... 'అను సూత్రముచే పరవల్లింగము (స్త్రీ లింగము) సమాసమునకు ప్రాప్తించు చుండగా 'ద్విగు ప్రాప్తా పన్నాలం పూర్వ .... 'అను వార్తికముచే నిషేధము.

ఆపన్న జీవికః : ఆపన్నః జీవికామ్ అని. లౌ.వి.వా. ఆపన్న + సు + జీవికా + అమ్ అని. అలౌ. వి. వా. తక్కిన ప్రక్రియ యంతయు ప్రాప్త జీవికః వలెనే.

ఈ సూత్రముచే సమాసము రానిపక్షమున ఈ రెండు చోట్లను "ద్వితీయా శ్రితాతీత" అను సూత్రముచే సమాసము వచ్చి జీవికాప్రాప్తః, జీవికాపన్నః అను రూపములును సిద్ధించును.

అలంకుమారిః : (కుమారికి చాలినవాడు) "అలం కుమార్యై" అని లౌకిక విగ్రహ వాక్యము. చతుర్థీతత్పురుషసమాసము. ఇట 'పరవల్లింగం ద్వంద్వ ...' అను సూత్రముచే పరవల్లింగము (స్త్రీ లింగము) సమాసమునకు రావలసియుండగా 'ద్విగుప్రాప్తాపన్నాలంపూర్వ....' అను వార్తికముచే పరవల్లింగప్రతిషేధము రాగా, విశేష్యము నాశ్రయించి పుంలింగమే రాగా అలంకుమారిః అని యగును.

చతుర్థ్యంతము తదర్థార్థ వాచకముతోను, బలి, హిత, సుఖ, రక్షిత శబ్దములతోను సమసించునని "చతుర్థీ...." అను సూత్రముయొక్క అర్థము. అలం అనునది పీనిలో లేదు కనుక కుమార్యై అను చతుర్థ్యంతము సమసించుటకు పీలులేదు. "పరవల్లింగం ద్వంద్వ...." అను సూత్రముచే పరవల్లింగమునకు ప్రాప్తి లేనపుడు "ద్విగుప్రాప్తా పన్నాలం పూర్వ" అను వార్తికముచే విధింపబడు పరవల్లింగనిషేధము వ్యర్థమై అలంపూర్వక తత్పురుషముండునని జ్ఞాపింపజేయును. అప్పుడు తిరిగి పరవల్లింగ ప్రాప్తి రాగా దానికి "ద్విగు ప్రాప్తాపన్నాలం పూర్వ" అను వార్తికముచే నిషేధము.

నిష్కౌశాంబిః : నిర్గతః కౌశాంబ్యాః అని లౌకికవిగ్రహవాక్యము. నిర్ + కౌశాంబీ + జసి అనుచోట.... నిరాదయః క్రాన్తాద్యర్థే పంచమ్యా అను వార్తికముచే సహకృతమగు "కుగతి ప్రాదయః" అను సూత్రముచే సమాసము. సుబ్లోపము. (నిర్ + కౌశాంబీ) "ఇట పరవల్లింగం ద్వంద్వ.." అను సూత్రముచే పరవల్లింగము (కౌశాంబీ శబ్దలింగమగు స్త్రీ లింగము) సమాసమునకు ప్రాప్తము కాగా నిది గతిసమాసమగుటచే 'ద్విగుప్రాప్తాపన్నాలం పూర్వ....' అను వార్తికముచే పరవల్లింగ ప్రతిషేధము. 'గోస్త్రియోరుప సర్జనస్య' అను సూత్రముచే హ్రస్వము (నిర్ + కౌశాంబి) పిదప సంధి రాగా నిష్కౌశాంబి అని యగును.

సూ: అర్ధర్చాః పుంసి చ

వృ:- అర్ధర్చాదయః శబ్దాః పుంసి క్లీబే చ స్యుః. అర్ధర్చః, అర్ధర్చమ్; ఏవం ధ్వజ, తీర్థ, శరీర, మండప, యూప, దేహ, ంకుశ, పాత్ర, సూత్రాదయః.

అర్ధర్చ మున్నగు శబ్దములు పుంలింగమందును, నపుంసకలింగ మందును ఉండును.

అర్ధర్చః: 'ఋచః అర్ధమ్' అను నర్థమున ఋచ్ + జస్ + అర్ధ + సు అను అలౌకిక విగ్రహవాక్యమున 'అర్ధం నపుంసకమ్' అను సూత్రముచే సమాసము. సుబ్లోపము. అర్ధశబ్దమునకు పూర్వనిపాతము. (అర్ధ + ఋచ్) గుణము (అర్ధర్చ్) 'ఋక్పూరబ్ధూః' అను సూత్రముచే సమాంతమగు అచ్ప్రత్యయము. (అర్ధర్చ్ + అ = అర్ధర్చ) ఇట 'పరవల్లింగం ద్వంద్వ....' అను సూత్రముచే పరశబ్దమగు ఋక్‌శబ్దలింగమగు స్త్రీలింగము రావలసియుండగా నీ సూత్రముచే పుంలింగ, నపుంసకలింగములు రాగా 'అర్ధర్చః, అర్ధర్చమ్' అను రూపములు సిద్ధించును.

ఈ అర్ధర్చాదిగణమున అర్ధర్చ మున్నగు పదములేకాక ధ్వజ, తీర్థ, శరీర, మండప, యూప, దేహ, అంకుశ, పాత్ర, సూత్ర మున్నగు అసమస్తపదములును కలవు. కనుక నీ శబ్దములకు ధ్వజమ్, ధ్వజః ఇత్యాది పుం, నపుంసకరూపములు రెండును ఉండుని భావము.

వా:- సామాన్యే నపుంసకమ్, మృదు పచతి. ప్రాతః కమనీయమ్

విశేష్యవిశేషణములు సన్నిహితములుగా నున్నప్పుడు లింగము వ్యక్తము కాని స్థలములలో సామాన్యముగా నపుంసకలింగము వచ్చును.

మృదు పచతి : మెత్తగా వండుచున్నాడు. ఇచట పచధాతువునకు విక్లిత్త్యనుకూలవ్యాపార మర్థము. మృదువను విశేషణము విక్లిత్త్యంశ ముతో సమన్వయించును. మృదువైన పాకమును చేయుచున్నాడు అని పర్యవసితార్థము.

ఇట విశేషణమగు మృదుపదము పచధాత్వర్థమును, ద్వితీయాంత మును అగు విక్లిత్త్యంశముతో సమన్వయించుటచే ద్వితీయాంతమేయైనను ఇట ప్రత్యేకముగా నొక లింగము భాసింపకపోవుటచే మృదుశబ్దము నపుంసకముగనే యుండును.

ప్రాతః కమనీయమ్: (ప్రాతఃకాలము రమ్యమైనది.) ఇట ప్రాతర్ అను అవ్యయమునకు లింగవిశేషమేదియు లేకపోవుటచే తద్విశేషణమగు 'కమనీయమ్' అను పదము ఈ వార్తికముచే నపుంసక లింగమున ప్రయుక్తమైనది.

# అథ బహువ్రీహిః

సూ : శేషో బహువ్రీహిః 2.2.23

వృ : అధికారోఽయం ప్రాగ్ద్వంద్వాత్

ఈ సూత్రము 'చార్థే ద్వంద్వః' (2-2-29) అను సూత్రమువరకు అధికరించును.

సూ : అనేకమన్యపదార్థే 2.2.24

వృ : అనేకం ప్రథమాంతం అన్యస్య పదస్యార్థే వర్తమానం వా సమస్యతే; స బహువ్రీహిః

అన్య పదార్థమును బోధించు అనేక ప్రథమాంతము వికల్పముగ సమసించును. అది బహువ్రీహి.

పూర్వ సూత్రములైన ద్వితీయా (2-1-24) తృతీయా (2-1-30) చతుర్థీ (2-1-36) ఇత్యాది సూత్రములచే ద్వితీయా విభక్తి మొదలుకొని సప్తమీ విభక్తి వరకున్న ఆరు విభక్తులకును సమాసము విధింపబడినది. కనుక పూర్వ సూత్రములోని శేష అనుదానికి ప్రథమావిభక్త్యంతమని భావము. అన్య పదార్థమును బోధించు ప్రథమావిభక్త్యంతములు వికల్పముగ సమసించునని సూత్రార్థము. అదియే బహువ్రీహి.

బహువ్రీహి సమాసమున సమసించు పదములు ప్రథమాంతములై యుండవలెననుటచే నిది సమానాధికరణ సమాసము. బహువ్రీహిలో

ప్రథమాంతములైన రెండు పదములు కాని, అంతకన్న నెక్కువకాని ఉండవచ్చును. బహువ్రీహి సమాసములో నుండు పదములు అన్య పదార్థ మును బోధించవలెననుటచే, వానికి ప్రాధాన్యము లేక అన్యపదార్థమునకే ఉండుటచే 'అన్యపదార్థ ప్రధానో బహువ్రీహిః' అని చెప్పబడినది.

సూ : సప్తమీవిశేషణే బహువ్రీహౌ 2.2.35

వృ : సప్తమ్యంతం విశేషణం చ బహువ్రీహౌ పూర్వం స్యాత్;అత ఏవ జ్ఞాపకాద్వ్యధికరణపదో బహువ్రీహిః.

సప్తమీ విభక్త్యంతమగు పదమును విశేషణ వాచక పదమును బహువ్రీహి సమాసమున పూర్వము ప్రయోగింపదగినది. ఈ జ్ఞాపకము వలననే వ్యధికరణమైన బహువ్రీహియు నుండునని తెలియుచున్నది.

బహువ్రీహి సమాసమున సప్తమ్యంతమైన పదమునకును, విశేషణ వాచకపదమునకును పూర్వనిపాతము వచ్చునని సూత్రార్థము. "అనేకమన్య పదార్థే" అను బహువ్రీహి విధాయక సూత్రమున అనేకం అనునది ప్రథమా నిర్దిష్టము కనుక తద్వాచ్యములగు ప్రథమాంతములలో దేనికి పూర్వనిపాతము రావలెనో ఈ సూత్రము తెలుపుచున్నది. 'చిత్రాః గావః యస్మిన్ సః'అనుచోట చిత్రాః, గావః అను రెండు ప్రథమాంతము లును 'అనేకం' అను ప్రథమచే నిర్దిష్టములగుటచే ఆ రెంటికి ఉపసర్జన సంజ్ఞయు, పూర్వనిపాతమును ప్రాప్తించినవి. ఈ సూత్రముచే విశేషణ మగు చిత్రశబ్దమునకే పూర్వనిపాతము విధింపబడినది.

ఇట్లే సప్తమ్యంత పదమునకును ఈ సూత్రముచే పూర్వనిపాతము విధింపబడినది. పూర్వసూత్రముచే ప్రథమాంతములగు పదములకే బహు వ్రీహి విధింపబడినది. ప్రథమాంతభిన్నములగు పదములకు బహువ్రీహి

రాదు. కాని యీ సూత్రమున సప్తమ్యంతమునకు పూర్వనిపాతము విధించుటచే బహువ్రీహి వ్యధికరణముగాకూడ నుండవచ్చునని తెలియుచున్నది. కనుకనే కంఠేకాలః (కంఠే కాలః యస్య సః) ఇత్యాదిస్థలములలో బహువ్రీహి సమాసము వచ్చినది.

సూ: హలదంతాత్సప్తమ్యాః సంజ్ఞాయామ్ 3-6-9

వృ:- హలంతాత్ అదంతాచ్చ సప్తమ్యాః అలుక్ సంజ్ఞాయామ్.

హలంతమును, అదంతమును (హ్రస్వాకారాంతమును) అగు శబ్దమునకు పరముగనున్న సప్తమీవిభక్తి ప్రత్యయమునకు అలుక్ వచ్చును. అలుక్ అనగా లోపము రాకుండుట.

కంఠ + ఙి కాల + సు అని యుండగ పూర్వసూత్రమున సప్తమీ గ్రహణముచే కంఠ + ఙి అను సప్తమ్యంతమునకు కాల + సు అను ప్రథమాంతముతో వ్యధికరణసమాసము. సప్తమీ విశేషణే అను సూత్రముచే కంఠ ఙి అను సప్తమ్యంతమునకు పూర్వ నిపాతము. 'సుపో ధాతు ప్రాతిపదికయోః" అను సూత్రముచే ఙి, సులకు లోపము ప్రాప్తింపగా నీ పదము శంకరునికి సంజ్ఞ యగుటచే నీ సూత్రముచే సప్తమికి అలుక్కు-రాగా సుకు మాత్రమే లోపము వచ్చి, కంఠ + ఙి + కాల అని యగును. పిదప గుణసంధిచే కంఠేకాల అను సమాసపదము ఏర్పడును.

బహువ్రీహి అన్య ప్రదార్థ ప్రధానము. ఆ అన్య పదార్థము ద్వితీయాది విభక్త్యంతములచే బోధింపబడదు. కనుక క్రమముగా ద్వితీయాదివిభక్త్యంతములచే అన్య పదార్థము బోధింపబడు నుదాహరణములును చూపబడుచున్నవి.

ప్రాప్తోదకః : (గ్రామః) ప్రాప్తం ఉదకం యం సః (ఏ గ్రామమును ఉదకము చేరినదో ఆ గ్రామము). ఇది లౌకికవిగ్రహము. యం అను ద్వితీయాంతముచే బోధింపబడు గ్రామమనునది అన్య పదార్థము. అది ఇట ప్రధానము. ప్రాప్త + సు + ఉదక + సు అను అలౌకిక విగ్రహ వాక్యమున "అనేక మన్య పదార్థే" అను సూత్రముచే బహుప్రీహి సమాసమును, 'సుపో ధాతు' అను సూత్రముచే సుప్పులకు లుక్కును, పిదప గుణమును రాగా ప్రాప్తోదక అని యగును. "కృత్తద్ధిత సమాసాశ్చ" అను సూత్రముచే 'ప్రాప్తోదక' అను శబ్దమునకు ప్రాతిపదికత్వము వచ్చి, సు చేర్చగా ప్రాప్తోదకః అని యగును.

ఊఢరథః : (అనడ్వాన్) ఊఢః రథః యేన సః (దేనిచే రథము మోయబడినదో ఆ ఎద్దు) అనునది లౌకిక విగ్రహ వాక్యము. యేన అను తృతీయాంతముచే బోధింపబడు ఎద్దు అన్యపదార్థము. ఊఢ + సు + రథ + సు అనునది అలౌకిక విగ్రహ వాక్యము. ప్రాప్తోదకః అను దాని వలెనే ప్రక్రియ.

ఉపహృతపశుః : (రుద్రః) ఉపహృతః పశుః యస్మై సః (ఏ శివుని కొరకై పశువు సమర్పింపబడినదో ఆ శివుడు.) అనునది లౌకిక విగ్రహ వాక్యము ఇట యస్మై అను తృతీయాంతముచే అన్య పదార్థము (శివుడనునది) చెప్పబడుచున్నది. ఉపహృత + సు + పశు + సు అనునది అలౌకిక విగ్రహ వాక్యము. ప్రక్రియ పూర్వమువలెనే.

ఉద్ధృతౌదనా (స్థాలీ) ఉద్ధృతం ఓదనం యస్యాః (ఏ స్థాలినుండి అన్నము తీయబడినదో అట్టి స్థాలీ) అనునది లౌకిక విగ్రహ వాక్యము. ఉద్ధృత + సు + ఓదన + సు అనునది అలౌకిక విగ్రహ వాక్యము. ప్రక్రియ పూర్వమువలెనే.

**పీతాంబరః** : (హరిః.) పీతం అంబరం యస్య సః (పసుపుపచ్చని వస్త్ర మెవనికి కలదో అతడు—విష్ణువు) అనునది లౌకిక విగ్రహ వాక్యము. పీత + సు + అంబర + సు అనునది అలౌకిక విగ్రహ వాక్యము. ప్రక్రియ పూర్వమువలెనే.

వీరపురుషకః : (గ్రామః) వీరాః పురుషాః యస్మిన్ సః. ప్రక్రియ పూర్వమువలెనే.

వా : ప్రాదిభ్యో ధాతుజస్య వాచ్యో వా చోత్తర పదలోపః ప్రపతితపర్ణః ప్రపర్ణః.

ప్రాదులకు పరముగానున్న ధాతు జన్య ప్రథమాంతమునకు వేరొక ప్రథమాంతముతో బహువ్రీహి చెప్పవలెను. ప్రాదులకు పరమందున్న ఉత్తరపదమునకు లోపము వికల్పముగా చెప్పవలెను.

ప్రపర్ణః : ప్రపతితాని పర్ణాని యస్మాత్ సః (ఏ వృక్షమునుండి ఆకులు రాలినవో అది) అనునది లౌకిక విగ్రహ వాక్యము. 'ప్రాదయో గతాద్యర్థే' అను సూత్రముచే ప్ర అను ఉపసర్గకు పతితశబ్దముతో సమాసము. పతిత అనునది ధాతుజన్యవిశేణము. ప్రథమాంతము కూడ. కనుక ప్రపతిత అనుదానికి ఈ సూత్రముచే పర్ణః అను ప్రథమాంతముతో సమాసమును, ప్ర అను దానికి పరముగనున్న ఉత్తరపదమగు పతిత శబ్దమునకు లోపమును రాగా, ప్రపర్ణః అని యగును. ఉత్తర పదమునకు లోపము వికల్పముగుటచే లోపము రాని పక్షమున ప్రపతితపర్ణః అనియే యుండును. ప్రపతిత + జస్ పర్ణ + జస్ అని అలౌకికవిగ్రహవాక్యము.

వా : నఞోఽస్త్యర్థానాం వాచ్యో వా చ ఉత్తరపద లోపః - అవిద్యమానపుత్రః అపుత్రః.

నఞ్‌కంటె పరమగు అస్త్యర్థకములగు (ఉన్న అను అర్థముగల) సుబంతములకు ప్రథమాంతముతో బహువ్రీహిసమాసమును, ఉత్తర పదమగు అస్త్యర్థకమునకు వైకల్పికలోపమును చెప్పవలెను.

అవిద్యమాన పుత్రః అపుత్రః.

అవిద్యమానః పుత్రః యస్య సః అని లౌకిక విగ్రహ వాక్యము. న విద్యమానః అవిద్యమానః. నఞ్ తత్పురుషము. ఇట నఞ్‌కు పరముగ నున్న 'విద్యమాన' అను అస్త్యర్థమునకు పుత్రః అను ప్రథమాంతముతో బహువ్రీహి. పిదప అస్త్యర్థమునకు వైకల్పికలోపము, లోపపక్షమున అపుత్రః. లోపాభావ పక్షమున 'అవిద్యమానపుత్రః' అను రెండురూపము లేర్పడును.

**సూ : స్త్రియాః పుంవద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియామపూరణీప్రియాదిషు 6-3-34**

వృ : ఉక్తపుంస్కా దనూఙ్ ఊఙోఽభావోఽస్యామితి బహువ్రీహిః; నిపాత నాత్పంచమ్యా అలుక్, షష్ఠ్యాశ్చ లుక్. తుల్యే ప్రవృత్తి నిమిత్తే యదుక్త పుంస్కం తస్మాత్పర ఊఙోఽభావో యత్ర తథా భూతస్య స్త్రీవాచకశబ్దస్య పుంవాచక స్యేవ రూపం స్యాత్ సమానాధికరణే స్త్రీలింగే ఉత్తరపదే; నతు పూరణ్యాః ప్రియదౌ చ పరతః.

గోస్త్రియోరితి హ్రస్వః; చిత్రగుః. రూపవద్భార్యః; అనూఙ్ కిమ్? వామోరూభార్యః; పూరణ్యాం తు.

**సూ : అప్పూరణీప్రమాణ్యోః 5-4-116.**

వృ :- పూరణార్థప్రత్యయాన్తం యత్ స్త్రీలింగం తదంతాత్ప్రమాణ్యంతాచ్చ బహువ్రీహేరప్స్యాత్;కల్యాణీ పంచమీ యాసాం రాత్రీణాం

తాః కల్యాణీపంచమా రాత్రయః; స్త్రీ ప్రమాణీ యస్య స స్త్రీప్రమాణః;
అప్రియాదిషు కిమ్? కల్యాణీప్రియ ఇత్యాది.

పూరణార్థక ప్రత్యయాంతమగు స్త్రీలింగ శబ్దమును, ప్రమాణీ శబ్దమును అంతమందు గల బహువ్రీహి సమాసమునకు సమాసాంతమగు అప్ ప్రత్యయము వచ్చును.

కల్యాణీపంచమాః రాత్రయః:- కల్యాణీ పంచమీ యాసాం తాః అని విగ్రహము. కల్యాణియగు ఐదవది (రాత్రి) కలది అని యర్థము. పంచమీ యనునది పూరణార్థక డట్ ప్రత్యయాంతమగు స్త్రీలింగశబ్దము. అట్టి శబ్దమంతమందుగల కల్యాణీ పంచమీ అను బహువ్రీహిసమాసపదమునకు అంతమున అప్ప్రత్యయము రాగా, కల్యాణీ పంచమీ + అ అని యగును. 'యస్యేతి చ' అను సూత్రముచే ఈ కారలోపము (కల్యాణీ పంచమ్) అజాద్యతష్టాప్ అను సూత్రముచే టాప్ ప్రత్యయము రాగా కల్యాణీపంచమా అని యగును.

ఇట పరమందున్న పంచమీశబ్దము పూరణార్థకప్రత్యయాంతమగు స్త్రీలింగ శబ్దమగుటచే పూర్వ సూత్రముచే భాషిత పుంస్కమగు కల్యాణీ శబ్దమునకు పుంవద్భావనిషేధము.

స్త్రీప్రమాణః :- స్త్రీ ప్రమాణీ యస్య సః (స్త్రీ ప్రమాణముగా గలవాడు) అని విగ్రహము. ప్రమాణీ శబ్దమంతమందుగల బహువ్రీహి యగుటచే స్త్రీ ప్రమాణీ అను శబ్దముపై నీ సూత్రముచే అప్ ప్రత్యయము. ఈ కారలోపము.

కల్యాణీ ప్రియా యస్య సః (కల్యాణియగు ప్రియురాలు గల వాడు) అను నర్థమున కల్యాణీ ప్రియః అని యగును. ఇటకల్యాణీ శబ్దము భాషిత పుంస్కమేయైనను పూర్వ సూత్రమందలి 'అపూరణ ప్రియాదిషు' అను నిషేధముచే పుంవద్భావము రాదు.

**సూ : బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాంగాత్ షచ్ 5-4-113**

వృ : స్వాంగవాచిసక్థ్యక్ష్యంతాద్బహువ్రీహేః షచ్ స్యాత్. దీర్ఘ సక్థః, జలజాక్షీ, స్వాంగాత్కిమ్? దీర్ఘ సక్థం శకటమ్. స్థూ లాక్షా వేణుయష్టిః; అక్ష్ణో౽దర్శనాదితి వక్ష్యమాణో౽చ్.

స్వాంగ వాచకములగు, సక్థి, అక్షి శబ్దములంతమందు గల బహువ్రీహిసమాసముపై షచ్ ప్రత్యయము వచ్చును.

దీర్ఘసక్థ: దీర్ఘే సక్థినీ యస్య సః (పొడవైన తొడలు కలవాడు) అని విగ్రహము, 'అనేకమన్య పదార్థే' అను సూత్రముచే దీర్ఘ శబ్దమునకును, సక్థి శబ్దమునకును సమాసము. దీర్ఘ సక్థి యనునది అవయవ వాచక సక్థ్యంతమగుటచే నీ సూత్రముచే షచ్ ప్రత్యయము (దీర్ఘసక్థి + అ)ఇకార లోపము (దీర్ఘసక్థ).

జలజాక్షీ : జలజే ఇవ అక్షిణీ యస్యాః సా (కమలముల వంటి కన్నులు గలది) అని విగ్రహము. "అనేకమన్యపదార్థే" అను సూత్రముచే బహువ్రీహి సమాసము. జలజాక్షీ అనుచోట అవయవ వాచకమగు అక్షి శబ్దమంతమందుండుటచే నీ సూత్రముచే షచ్ ప్రత్యయము (జలజాక్షి + అ) ఇకారలోపము (జలజాక్ష) 'షచ్' ప్రత్యయము షిత్తగుటచే "షిద్గౌరాదిభ్యశ్చ" అను సూత్రముచే ఙీష్ప్రత్యయము రాగా, జలజాక్షీ అని యగును.

స్వాంగవాచకములగు సక్థి, అక్షి శబ్దములు అంతమందు గల బహుబ్రీహిపైననే షచ్‌ప్రత్యయము వచ్చుననుటచే దీర్ఘసక్థి - శకటమ్, స్థూలాక్షా వేణు యష్టిః అనుచోట్ల షచ్ ప్రత్యయము రాదు. దీర్ఘసక్థినీ (నిపపు కఱ్ఱలు) యస్య తత్ అను చోట సక్థిశబ్దము శరీరావయవవాచకము కాకపోవుటచే 'దీర్ఘసక్థి' అనుచోట షచ్‌ప్రత్యయము రాదు. స్థూలాని అక్షీణి (కణుపులు) యస్య తత్ అనుచోట అక్షిశబ్దము శరీరావయవ వాచకము కాకపోవుటచే నీ సూత్రముచే షచ్ ప్రత్యయము రాదు. "అక్ష్ణోఽదర్శనాత్" అను సూత్రముచే స్థూలాక్షి శబ్దముపై అచ్ ప్రత్యయము - ఇకారలోపము - టాప్ (స్థూలాక్షా) షచ్ ప్రత్యయమే వచ్చినచో నది షిత్తు కనుక షిద్గౌరాది భ్యశ్చ అను సూత్రముచే జీష్ వచ్చి స్థూలాక్షీ అని యయ్యెడిది.

**సూ : ద్విత్రిభ్యాం ష మూర్ధ్నః 5-4-115**

వృ :- ఆభ్యాం మూర్ధ్నః షః స్యాద్బహుబ్రీహౌ, ద్వి మూర్ధః త్రి మూర్ధః.

ద్వి, త్రి శబ్దములకు పరమందున్న మూర్ధన్ శబ్దమునకు 'ష' ప్రత్యయము వచ్చును.

ద్వి మూర్ధః : ద్వౌ మూర్ధానౌ యస్య సః (రెండు మూర్ధములు కలది) అని విగ్రహము. "అనేక........"అను సూత్రముచే బహుబ్రీహి సమాసము, ద్వి మూర్ధన్ అనుచోట ద్విశబ్దమునకు పరముగ నున్న మూర్ధన్ శబ్దమునకు ఈ సూత్రముచే 'ష' ప్రత్యయము (ద్విమూర్ధన్ + అ) 'నస్తద్ధితే' అను సూత్రముచే టి (అన్) లోపము (ద్విమూర్ధ).

త్రిమూర్ధః :- త్రయః మూర్ధానః యస్య సః (మూడు మూర్ధములు గలవాడు) త్రిమూర్ధన్ అను బహువ్రీహిపై ఈ సూత్రముచే 'ష' ప్రత్యయము - టి లోపము - ఉచ్చైః మూర్ధా యస్య సః అనుచోట ద్వి లేక త్రి అనునది పూర్వపదముగా లేదు కనుక ష ప్రత్యయము రాదు. ఉచ్చైర్మూర్ధా అనియే కాని ఉచ్చైర్మూర్ధః అని కాదు.

**సూ : అంతర్బహిర్భ్యాం చ లోమ్నః 5.4.117**

వృ : ఆభ్యాం లోమ్నోఽప్స్యాద్బహువ్రీహౌ, అంతర్లోమః, బహిర్లోమః.

బహువ్రీహి సమాసమున అంతర్, బహిర్ అను శబ్దములకు పరముగానున్న లోమన్ శబ్దముపై 'అప్' ప్రత్యయము వచ్చును.

అంతర్లోమః : అంతః లోమాని యస్య సః అని విగ్రహము. 'అనేక మన్య.......'అను సూత్రముచే బహువ్రీహి 'అంతర్లోమన్' అను శబ్దముపై ఈ సూత్రముచే అప్ప్రత్యయము (అంతర్లోమన్ + అ) టి (అన్) లోపము.

బహిర్లోమః : బహిః లోమాని యస్య సః అని విగ్రహము. ప్రక్రియ అంతర్లోమః అనుచోటవలెనే.

**సూ : పాదస్య లోపోఽహస్త్యాదిభ్యః 5.4.138**

హస్త్యాది వర్జితాదుపమానాత్పరస్య పాద శబ్దస్య లోపః స్యాద్బహువ్రీహౌ. వ్యాఘ్రస్యేవ పాదావస్య వ్యాఘ్రపాత్ అహస్త్యాదిభ్యః కిమ్? హస్తిపాదః కుసూలపాదః.

బహువ్రీహిసమాసమున హస్తి మున్నగు పదములకంటె భిన్నము లగు ఉపమానవాచక పదములకు పరమైన పాదశబ్దమునకు లోపము వచ్చును. ఈ లోపము పాదశబ్దములోని అంత్యవర్ణమగు అవర్ణమునకు వచ్చును.

వ్యాఘ్రపాత్:- వ్యాఘ్రపాదావివ పాదౌ అస్య అని విగ్రహ వాక్యము. (వ్యాఘ్రముయొక్క పాదములవంటి పాదములు గలవాడు)

'వ్యాఘ్రపాద' అను బహువ్రీహిసమాసమున హస్త్యాది భిన్నమగు వ్యాఘ్రశబ్దమునకు పరమందున్న పాదశబ్దములోని దకారము మీది అవర్ణమునకు లోపము (వ్యాఘ్రపాద్) 'వాఽవసానే' అను సూత్రముచే రేఫమునకు వైకల్పికముగా చర్త్వము (వ్యాఘ్రపాత్, వ్యాఘ్రపాద్).

హస్తిపాదః, కుసూలపాదః అను బహువ్రీహిసమాస స్థలములలో హస్తి, కుసూల అను పదములు హస్త్యాదిపదములకంటె పరముగనున్నందున పాదశబ్దములోని దకారముమీది అకారమునకు లోపము రాదు. హస్తిపాత్, కుసూలపాత్ అను రూపములు సిద్ధించవు.

**సూ: సంఖ్యా సుపూర్వస్య 5-4-140**

వృ:- పాదస్య లోపః స్యాత్సమాసాంతే బహువ్రీహౌ. ద్విపాత్, సుపాత్.

బహువ్రీహిసమాసమున సంఖ్యావాచక శబ్దము, సు అను శబ్దము పూర్వమందుగల పాదశబ్దమునకు సమాసాంతమున లోపము వచ్చును.

ద్విపాత్: ద్వౌ పాదౌ అస్య (రెండు పాదములు గలవాడు) అని విగ్రహము. "అనేకమన్య...." అను సూత్రముచే బహువ్రీహిసమాసమున

'ద్వి' అను సంఖ్యావాచక శబ్దమునకు పరమందున్న పాద శబ్దములోని దకారముమీది అకారముకు ఈసూత్రముచే లోపము (ద్విపాద్) 'వాఽవసానే' అను సూత్రముచే దకారమునకు వైకల్పికముగా చర్త్వము (ద్విపాత్)

సుపాత్ : శోభనౌ పాదౌ అస్య (మంచిపాదములు గలవాడు) అని విగ్రహము. సుపాద అను బహువ్రీహిసమాసమున సు అను శబ్దమునకు పరమందున్న పాదశబ్దములోని అంత్యాకారమునకు ఈ సూత్రముచే లోపము (సుపాద్), వైకల్పికచర్త్వము (సుపాత్, సుపాద్)

**సూ : ఉద్విభ్యాం కాకుదస్య 5-4-148**

వృ : లోపః స్యాత్. ఉత్కాకుత్ వికాకుత్.

ఉత్, వి అను శబ్దములకు పరమైన కాకుద శబ్దమునకు బహువ్రీహిసమాసమున సమాసాంతలోపము వచ్చును.

ఉత్కాకుత్ : ఉన్నతం కాకుదం యస్య సః (ఎత్తైన మూపురము కలవాడు) అని విగ్రహము. ఉత్కాకుద అని యుండగా ఈ సూత్రముచే దకారముమీది అకారము లోపించగా ఉత్కాకుద్ అని యగును. 'వాఽవసానే' అను సూత్రముచే వైకల్పిముగ చర్త్వము రాగా ఉత్కాకుత్, ఉత్కాకుద్ అను రూపములు సిద్ధించును.

వికాకుత్: విగతం కాకుదం యస్య సః (మూపురము పోయినవాడు) ఈ సూత్రముచే దకారముమీది అకారమునకు లోపము. 'వాఽవసానే' అనుసూత్రముచే వైకల్పిక చర్త్వము, (వికాకుత్, వికాకుద్)

**సూ : పూర్ణాద్విభాషా 5-4-149**

వృ : పూర్ణకాకుత్, పూర్ణకాకుద్.

పూర్ణ శబ్దమునకు పరమందున్న కాకుద శబ్దమునకు బహువ్రీహి సమాసమున వికల్పముగ సమాసాంతలోపము వచ్చును.

పూర్ణకాకుత్ }
పూర్ణకాకుదః } పూర్ణం కాకుదం యస్య సః అని విగ్రహము.

ఈ సూత్రముచే దకారముమీది అకారమునకు వైకల్పిక లోపము. లోపము వచ్చిన పక్షమున వాఽవసానే అను సూత్రముచే చర్త్వము రాగా పూర్ణ కాకుత్, పూర్ణకాకుద్ అను రూపములు సిద్ధించును. లోపము రానిపక్షమున పూర్ణకాకుదః అనియే యగును.

సూ : సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః 5-4-150

వృ : సుదుర్భ్యామ్ హృదయస్య హృద్భావో నిపాత్యతే; సుహృన్మిత్రమ్. దుర్హృత్ అమిత్రః

బహువ్రీహి సమాసమున సు, దుర్ అనువానికి పరమందున్న హృదయశబ్దమునకు క్రమముగా మిత్రుడు, శత్రువు అను నర్థములలో హృద్ అను ఆదేశము నిపతింపబడుచున్నది.

సుహృత్ : శోభనం హృదయం అస్య అని విగ్రహము. ఈ సూత్రముచే హృదయశబ్దమునకు 'హృద్' ఆదేశనిపాతము - వైకల్పిక చర్త్వము (సుహృత్, సుహృద్) సుహృత్ అనగా మిత్రుడు.

దుర్హృత్ : దుష్టం హృదయం అస్య అని విగ్రహము. హృదయ శబ్దమునకు హృద్ ఆదేశ నిపాతము, వైకల్పికచర్త్వము - దుర్హృత్, దుర్హృద్ అనగా శత్రువని యర్థము.

మిత్రుడు, శత్రువు అను అర్థము లేనపుడు హృదాదేశ నిపాత ముండదు. కనుక సుహృదయః (కారుణికః) దుర్హృదయః (చోరః) అను రూపములే సిద్ధించును.

సూ : ఉరఃప్రభృతిభ్యః కప్ 5-4-151

బహువ్రీహిసమాసమున ఉరస్ మున్నగు పదములపై సమాసాంత మగు కప్ ప్రత్యయము వచ్చును.

సూ : కస్కాదిషు చ 8-3-48

వృ:- ఏష్విణ ఉత్తరస్య విసర్గస్య షో ఽ న్యస్య తు సః ఇతి సః; వ్యూఢోరస్కః.

కస్క మున్నగుపదములలో ఇణ్ కు పరమందున్న విసర్గమునకు షకారము వచ్చును. ఇతరములకు పరమైన విసర్గమునకు సకారమే వచ్చును.

వ్యూఢోరస్కః : వ్యూఢం ఉరః యస్య సః (విశాలమైన వక్షఃస్థలము గలవాడు) అని విగ్రహము. అనేకమన్య పదార్థే అను సూత్రముచే బహువ్రీహి-వ్యూఢోరస్ అను బహువ్రీహిపై "ఉరఃప్రభృ...." అను పూర్వసూత్రముచే కప్ ప్రత్యయము (వ్యూఢోరస్ + క) సకారమునకు రుత్వ, విసర్గములు (వ్యూఢోరః + క)"కుప్వోః ≍క ≍పౌ చ" అను సూత్రముచే విసర్గ స్థానమున జిహ్వామూలీయము ప్రాప్తము కాగా ఈ సూత్రముచే విసర్గకు సకారాదేశము (వ్యూఢోరస్క).

ప్రియ సర్పిష్కః: ప్రియం సర్పిః యస్య సః అని విగ్రహము. ప్రియసర్పిస్ అను శబ్దముపై పూర్వసూత్రముచే కప్ ప్రత్యయము, సకా

రమునకు రుత్వ విసర్గములు (ప్రియసర్పిః + క) ఇణ్ కంటె పరమైనందున విసర్గమునకీ సూత్రముచే షత్వము రాగా ప్రియసర్పిష్కః అని సిద్ధించును.

**సూ : నిష్ఠా 2-2-36**

వృ : నిష్ఠాంతం బహువ్రీహౌ పూర్వం స్యాత్; యుక్తయోగః.

బహువ్రీహిసమాసమున నిష్ఠాంతము (క్త, క్తవతు ప్రత్యయాంతము) పూర్వ పదముగ ప్రయోగింపదగినది.

యుక్త యోగః : యుక్తః యోగః యస్య సః అని విగ్రహము. "అనేకమన్య ...." అను సూత్రముచే బహువ్రీహి. ఈ సూత్రముచే నిష్ఠాంతము (క్త ప్రత్యయాంతము) అగు యుక్తశబ్దమునకు పూర్వనిపాతము.

**సూ : శేషాద్విభాషా 5-4-154**

వృ : అనుక్తసమాసాంతాద్బహువ్రీహేః కబ్వా; మహాయశస్కః, మహాయశాః.

సమాసాంత ప్రత్యయములు చెప్పబడని బహువ్రీహి సమాసముపై కప్ప్రత్యయము వికల్పముగ వచ్చును.

మహాయశస్కః, మహాయశాః } మహత్ యశః యస్య సః అని విగ్రహము. "అనేకమన్య...." అను సూత్రముచే బహువ్రీహి. 'ఆన్మహతః....' అను సూత్రముచే మహత్ శబ్దమునకు ఆకారమంతాదేశము-ఈ సూత్రముచే కప్ (అ) ప్రత్యయము (మహాయశస్కః) కప్ ప్రత్యయము రాని పక్షమున 'మహాయశాః' అని రూపము.

ఇతి బహువ్రీహిః

# అథ ద్వంద్వః

**సూ : చార్థే ద్వంద్వః 2-2-29**

వృ : అనేకం సుబంతం చార్థే వర్తమానం వా సమస్యతే, స ద్వంద్వః. సముచ్చ-యాన్వాచ-యేత రేతరయోగ సమాహారాశ్చార్థాః తత్ర 'ఈశ్వరం గురుం చ భజస్వ' ఇతి పరస్పర నిరపేక్షస్యానేక స్యైకస్మిన్నన్వయః సముచ్చయః; భిక్షామట గాంచానయ ఇత్యన్యతరస్యాను షంగికత్వేనాన్వయోఽన్వాచయః; అనయో రసామర్థ్యాత్సమాసో న ధవఖదిరౌ ఛింధి ఇతి మిలితానా మన్వయః ఇతరేతరయోగః; సంజ్ఞా పరిభాషమ్ ఇతి సమూహః సమాహారః.

చకారద్యోత్యమగు అర్థము గల అనేకములగు సుబంతములు వికల్పముగ సమసించును. అది ద్వంద్వ సమాసము. సముచ్చయము, అన్వాచయము, ఇతరేతరయోగము, సమాహారము అనునవి చకారద్యోత ములగు అర్థములు నాలుగు.

ఒక దాని యపేక్ష మరొక దానికి లేనట్టి అనేకార్థములకు ఒక అర్థమునందన్వయమున్నపుడు సముచ్చయార్థము. ఉదా: ఈశ్వరం గురుం చ భజస్వ; (ఈశ్వరుని, గురువును సేవింపుము.) పరస్పరాపేక్ష లేని (పరస్పర నిరపేక్ష యనగా ఒకటి క్రియ యందన్వయించిన పిదప మరొకటి క్రియావృత్తిచే ఆ క్రియయందు అన్వయించుట).

ఈశ్వరునికిని, గురువునకును భజన క్రియ యందు కర్మగ అన్వయముండుటచే ఇది సముచ్చయమునకు ఉదాహరణము.

రెండు వస్తువులలో ఒకటి ప్రధానమై, రెండవది అప్రధానమైనపుడు అన్వాచయము. ఉదా: భిక్షామట, గాం చానయ (భిక్షాటనము చేయుము. గోవును కూడ తీసికొనిరమ్ము.) భిక్ష కొరకు పోయినపుడు మార్గమున గోవు కనిపించినచో తీసికొనిరమ్మనియు, గోవును తీసికొనిరాకున్నను భిక్షకు మాత్రము తప్పక వెళ్లుమనియు ఈ వాక్యమున కర్థము. భిక్షకు వెళ్ళినపుడు గోవును తెచ్చుట అవశ్యకము కాదు కనుక గవానయనము ఆనుషంగికము.

పరస్పరాపేక్షగల అనేక పదార్థములకు ఒక అర్థమందు అన్వయ మున్నపుడు ఇతరేతరయోగము. ఉదా :- ధవఖదిరౌ ఛింధి (ధవఖది రములను ఛేదించుము.) ఇట సముదాయమున కవయవములగు ధవఖది రములను ఛేదించుమని అర్థమగుటచే నిట ఇతరేతరయోగమను చార్థము.

సముదాయము సమాహారము. ఉదా : సంజ్ఞా పరిభాషమ్, సంజ్ఞా పరిభాషల సమూహమని అర్థము. కనుక నిట సమాహారమను చార్థము.

పైన పేర్కొన్న చకారద్యోత్యములగు నాలుగర్థములలో సము చ్చయము, అన్వాచయము అను అర్థములలో ఏకార్థీభావరూప సామర్థ్యము లేనందువల్ల సమాసము రాదు. ఇతరేతర యోగమందును, సమాహార మందును ఏకార్థీభావరూప సామర్థ్యముండుటచే ఈ సూత్రముచే సమాసము వచ్చును.

**సూ : రాజదంతాదిషు పరమ్ 2-2-31**

వృ : ఏషు పూర్వప్రయోగార్హం పరం స్యాత్.

దంతానాం రాజానో రాజదంతాః. (ధర్మాదిష్వనియమః) అర్థ ధర్మౌ, ధర్మార్థావిత్యాది.

'రాజదంత' మున్నగు శబ్దములలో పూర్వప్రయోగార్హమగు ఉపసర్జన సంజ్ఞకము ఉత్తరపదముగా ప్రయోగింపబడును.

రాజదంతః-దంతానాం రాజా అని విగ్రహము. 'షష్ఠీ' అను సూత్రముచే దంతానాం అను షష్ఠ్యంతమునకు రాజన్‌శబ్దముతో సమాసము. 'షష్ఠీ' అను సూత్రమున షష్ఠ్యంతమునకు ప్రథమా నిర్దిష్టమగుటచే ఉపసర్జన సంజ్ఞ. ఉపసర్జనసంజ్ఞకమగు దంతశబ్దమునకు పూర్వనిపాతము రావలసియుండగా ఈ సూత్రముచే పరనిపాతము రాగా 'రాజదంతః' అను రూపము సిద్ధించును.

గ. సూ : ధర్మాదిష్వనియమః.

ధర్మాదిశబ్దములచే నేర్పడు ద్వంద్వమున పూర్వ ప్రయోగ విషయమున నియమము లేదు.

ధర్మార్థౌ<br>అర్థ ధర్మౌ } ధర్మశ్చ అర్థశ్చ అని విగ్రహము. చార్థే ద్వంద్వః అను సూత్రముచే సమాసము. 'అజాద్యదన్తమ్' అను సూత్రముచే అజాదియు, అదన్తమునగు అర్థశబ్దమునకే పూర్వనిపాతము రావలసియుండగా ఈ గణసూత్రముచే రెండింటికి పూర్వనిపాతము రాగా ధర్మార్థౌ, అర్థధర్మౌ అను రెండు రూపములు సిద్ధించును.

సూ : ద్వంద్వే ఘి 2-2-23

వృ : ద్వంద్వే ఘిసంజ్ఞం పూర్వం స్యాత్. హరిశ్చ హరశ్చ హరిహరౌ.

ద్వంద్వసమాసమున ఘిసంజ్ఞకము[1] పూర్వము ప్రయోగింపబడును.

హరిహరౌ: హరిశ్చ హరశ్చ అని విగ్రహవాక్యము. చార్థే ద్వంద్వః అను సూత్రముచే సమాసము. హరి శబ్దము ఘిసంజ్ఞకమగుటచే దానికి పూర్వనిపాతము రాగా హరిహరౌ అని యగును. హరి, హర శబ్దములు రెండును ప్రథమా నిర్దిష్టములగుటచే ఉపసర్జనసంజ్ఞ వచ్చి రెండింటికి పూర్వనిపాతము రావలసియుండగా నీ సూత్రముచే ఘిసంజ్ఞకమునకే పూర్వనిపాతమని నియమము.

**సూ : అజాద్యదంతమ్ 2-2-33**

వృ : ద్వంద్వే పూర్వం స్యాత్. ఈశకృష్ణౌ

అజాదియు, అదంతమును అగు శబ్దము ద్వంద్వ సమాసమున పూర్వపదముగా నుండును.

ఈశకృష్ణౌ : ఈశశ్చ కృష్ణశ్చ అని విగ్రహము. 'చార్థే ద్వంద్వః' అను సూత్రముచే ద్వంద్వము. అజాదియు, అదంతమును అగు ఈ శబ్దమునకు పూర్వప్రయోగము.

**సూ : అల్పాచ్తరమ్ 2-2-34**

వృ : శివకేశవౌ.

అల్ప సంఖ్యాకములగు నచ్చులు గల శబ్దము ద్వంద్వ సమాసమున పూర్వపదముగా నుండును.

---

1. శేషో ఘ్యసఖి : నదీ సంజ్ఞలేని హ్రస్వములగు ఇకార ఉకారములంతమందుగల సఖిశబ్దభిన్నమగు శబ్దము ఘిసంజ్ఞకమనబడును.

శివకేశవౌ : శివశ్చ కేశవశ్చ అని విగ్రహము. ఇట శివశబ్దమున రెండచ్చులును, కేశవ శబ్దమున మూడచ్చులును కలవు. అల్పాచ్చులు గల శివశబ్దమునకే ఈ సూత్రముచే పూర్వ ప్రయోగము.

సూ:- పితా మాత్రా 1-2-70

వృ : మాత్రా సహోక్తౌ పితా వా శిష్యతే; మాతా చ పితా చ పితరౌ, మాతాపితరౌ వా.

మాతృ శబ్దముతోపాటు పితృశబ్దము చెప్పబడినప్పుడు పితృశబ్దము వికల్పముగ శేషించును,

పితరౌ : మాతా చ పితా చ అని విగ్రహము. 'చార్థే ద్వంద్వః' అను సూత్రముచే ద్వంద్వము. ఈ సూత్రముచే పితృశబ్దము మాత్రమే శేషించగా పితరౌ అని యగును. దీనినే ఏకశేషమని యందురు.

మాతా పితరౌ : పితృశబ్దము శేషించుట వికల్పము కావున నది రానిపక్షమున మాతాపితరౌ అను రూపము సిద్ధించును. అభ్యర్హితమగుటచే మాతృ శబ్దమునకు పూర్వనిపాతము. "ఆనఙ్ ఋతో ద్వంద్వే చ" అను సూత్రముచే మాతృ శబ్దమునకు ఆనఙ్ అంతాదేశము.

సూ :- ద్వంద్వశ్చ ప్రాణితూర్యసేనాంగానామ్ 2-4-2

వృ : ఏషాం ద్వంద్వ ఏకవత్. పాణి పాదమ్, మార్దంగికవైణవికమ్, రథికాశ్వారోహమ్.

ప్రాణ్యంగములు, తూర్యాంగములు, సేనాంగములు-వీనిని తెలుపు పదములు సమాహారద్వంద్వమున ఏకవచనమునందుండును.

పాణిపాదమ్:- పాణీ చ పాదౌ చ తయోః సమాహారః అని విగ్రహము. సమాహారార్థమున ద్వంద్వము ప్రాణ్యంగవాచకపదముల ద్వంద్వమగుటచే ఈ సూత్రముచే ఏకవద్భావము. 'స నపుంసకమ్' అను సూత్రముచే నపుంసకలింగము.

మార్దంగిక వైణవికమ్ : మార్దంగికాశ్చ వైణవికాశ్చ తేషాం సమాహారః (మృదంగవాదకులయు, వీణా వాదకులయు సముదాయము) సమాహారార్థమున ద్వంద్వము. తూర్యాంగవాచకశబ్దముల ద్వంద్వ మగుటచే నీ సూత్రముచే ఏకవద్భావము.

రథికాశ్వారోహమ్ : రథికాశ్చ అశ్వారోహాశ్చ తేషాం సమాహారః- సేనాంగవాచకముల ద్వంద్వమగుటచే నీ సూత్రముచే ఏకవద్భావము.

సూ : ద్వంద్వాచ్చుదష హాంతాత్ సమాహారే 5-4-106

వృ : చవర్గాంతాద్దషహాంతాచ్చ ద్వంద్వాత్ టచ్ స్యాత్సమాహారే. వాక్ చ త్వక్ చ వాక్త్వచమ్, త్వక్స్రజమ్, శమీదృషదమ్, వాక్త్విషమ్, ఛత్రోపానహమ్, సమాహారే కిమ్? ప్రావృట్ శరదౌ.

చవర్గ వర్ణములును, ద, ష, హలును అంతమందుగల ద్వంద్వ సమాసముపై సమాహారార్థమున టచ్ ప్రత్యయము సమాసాంతముగ వచ్చును.

వాక్త్వచమ్ : వాక్ చ త్వక్ చ తయోః సమాహారః అని విగ్రహము. ఇది చకారాంతసమాహార ద్వంద్వమగుటచే ఈ సూత్రముచే సమాసాంతమగు టచ్ ప్రత్యయము (వాక్త్వచ్ + అ = వాక్త్వచ) నపుంసక లింగము (వాక్త్వచమ్).

త్వక్స్రజమ్ : త్వక్ చ స్రక్ చ తయోః సమాహారః; ఇదియు చ వర్గాంతసమాహారద్వంద్వమగుటచే నీ సూత్రముచే సమాసాంతటచ్ ప్రత్యయము (త్వక్స్రజ్ + అ) నపుంసకలింగము (త్వక్స్రజమ్).

శమీదృషదమ్ :- శమీ చ దృషద్ చ తయోః సమాహారః - ఇది దకారాంత సమాహార ద్వంద్వమగుటచే నీ సూత్రముచే సమాసాంతమగు టచ్ ప్రత్యయము. నపుంసకలింగము.

వాక్త్విషమ్ : వాక్ చ త్విట్ చ తయోః సమాహారః. ఇది షకారాంత సమాహార ద్వంద్వమగుటచే ఈ సూత్రముచే టచ్ప్రత్యయము. నపుంసకలింగము.

ఈ నాలుగు ఉదాహరణము లందును 'జాతిరప్రాణినామ్' అను సూత్రముచే ఏకవద్భావమును, 'స నపుంసకమ్' అను సూత్రముచే నపుంసక లింగమును వచ్చును.

సమాహారద్వంద్వముననే ఈ సూత్రముచే టచ్ప్రత్యయము వచ్చు నని చెప్పుటచే ప్రావృట్శరదౌ (ప్రావృట్ చ శరత్ చ) అనునది ఇతరే తరయోగద్వంద్వమగుటచే ఇట టచ్ ప్రత్యయము రాదు.

ఇతి ద్వంద్వసమాసప్రకరణమ్.

# అథ సమాసాంతాః

సూ : ఋక్పూరబ్ధూః పథామానక్షే 5-4-74

వృ : అ అనక్షే ఇతి చ్ఛేదః, ఋగాద్యంతస్య సమాసస్య అప్రత్యయోఽంతావయవోఽక్షే యా ధూస్తదంతస్య తు న. అర్ధర్చః, విష్ణుపురమ్; విమలాపం సరః; రాజధురా; అక్షే తు అక్షధూః, దృఢధూరక్షః, సఖిపథః.

అనక్షే అనుచోట అ అనక్షే అని పదవిభాగము, ఋక్, పుర్, అప్, ధుర్, పథిన్ అను శబ్దములంతమందుగల సమాసమునను 'అ' అను ప్రత్యయము సమాసాంతముగ వచ్చును. 'అనక్షే' అనుటచే 'అక్షే ధూః' (అక్ష సంబంధమగు సీల) అను నర్థమున అక్షధుర్ అనుచోట ధుర్ శబ్దాంతమునకు అప్ ప్రత్యయము రాదు. అనక్షే అను నిషేధము ధుర్ శబ్దముతోనే సంబంధించును.

అర్ధర్చః(ఋక్కుయొక్క సగము) ఋచః అర్ధమ్ అని విగ్రహము. 'అర్ధం నపుంసకమ్' అను సూత్రముచే సమాసము. అర్చ అని యుండగా ఈ సూత్రముచే 'అ' ప్రత్యయము (అర్ధర్చ + అ) "అర్ధర్చాదయః పుంసి చ" అను సూత్రముచే పుంలింగము. (అర్ధర్చః)

విష్ణుపురమ్ : విష్ణోః పూః అని విగ్రహము. షష్ఠీ అను సూత్రముచే తత్పురుష సమాసము. విష్ణు పుర్ అని యుండగా నీ సూత్రముచే సమాసాంతమగు 'అ' ప్రత్యయము (విష్ణుపుర్ + అ) 'పరవల్లింగం ద్వంద్వ తత్పురుషయోః' అను సూత్రముచే పరశబ్దమగు పుర్ శబ్దము స్త్రీలింగ

మగుటచే విష్ణుపుర్ అను సముదాయమునకు కూడ స్త్రీ లింగము ప్రాప్త మైనది. కాని లోక వ్యవహారమువలన ఇట నపుంసకలింగమే వచ్చును (విష్ణుపురమ్).

విమలాపం సరః (స్వచ్ఛమైన జలము గల సరస్సు) విమలాః ఆపః యస్మిన్ తత్ అని విగ్రహము. బహువ్రీహి-విమలాప్ అని యుండగా నీ సూత్రముచే సమాసాంతమగు 'అ' ప్రత్యయము (విమ లాప్ + అ).

రాజధురా : రాజ్ఞః ధూః అని విగ్రహము. షష్ఠీ తత్పురుషము. రాజధుర్ అని యుండగా ఈ సూత్రముచే 'అ' ప్రత్యయము (రాజధుర్ + అ) 'అజాద్యాతష్టాప్' అను సూత్రముచే స్త్రీలింగమున టాప్ప్రత్యయము (రాజధురా)

ఇరుసుకు సంబంధించిన మొల అను నర్థమున ధుర్ శబ్దమునకు అనక్షే అని నిషేధముండుటచే అక్షధూః (అక్షస్య ధూః) అను షష్ఠీ తత్పురుషమునను, దృఢధూః (దృఢా ధూః యస్మిన్ సః) అను బహువ్రీహిసమాసమునను ధుర్‌శబ్దముపై సమాసాంతమగు 'అ' ప్రత్య యము రాలేదు.

సఖిపథః :- సఖ్యుః పంథాః అని విగ్రహము. షష్ఠీ అను సూత్రముచే సమాసము. సఖిపథిన్ అని యుండగా ఈ సూత్రముచే సమాసాంతమగు 'అ' ప్రత్యయము (సఖి + పథిన్ + అ) "టేః" అను సూత్రముచే టి లోపము (సఖిపథ్ + అ=సఖిపథ)

రమ్యపథః : రమ్యః పంథాః యస్మిన్ అని విగ్రహము. బహువ్రీహి సమాసము. రమ్యపథిన్ అని యుండగా ఈ సూత్రముచే సమాసాంతమగు 'అ' ప్రత్యయము. రమ్యపథిన్ + అ. టేః అను సూత్రముచే టి(ఇన్) లోపము. (రమ్యపథ్ + అ = రమ్యపథ)

**సూ : అక్ష్ణోఽదర్శనాత్ 5-4-76**

వృ : అచక్షుఃపర్యాయాదక్ష్ణోఽచ్ స్యాత్సమాసాంతః; గవా మక్షీవ గవాక్షః; చక్షుపర్యాయవాచకము కాని (నేత్రార్థకము కాని) అక్షశబ్దమునకు. సమాసాంతమగు అచ్ ప్రత్యయము వచ్చును.

గవాక్షం : గవాం అక్షీవ (గోవుల కన్నువలె నుండునది) అని విగ్రహము. షష్ఠీ అను సూత్రముచే షష్ఠీ తత్పురుషము- ఇచట అక్షి శబ్దము లక్షణచే అక్షిసదృశమైన జాలకము అను నర్థము బోధించు చున్నది. ముఖ్యార్థమగు నేత్రమును బోధించుట లేదు. కనుక ఈ సూత్రముచే అక్షి శబ్దముపై అచ్ ప్రత్యయము (గవాక్షి + అ) 'యస్యేతి చ' అను సూత్రముచే ఇకారలోపము (గవాక్ + అ = గవాక్ష)

**సూః- ఉపసర్గాదధ్వనః 5-4-85**

వృః- ప్రగతో ఽ ధ్వానం ప్రాధ్వో రథః

ఉపసర్గమునకు పరమైన అధ్వన్ శబ్దముపై సమాసాంతమగు అచ్ ప్రత్యయము వచ్చును.

ప్రాధ్వః :- ప్రగతః అధ్వానమ్ అని విగ్రహము. అత్యాదయః అను వార్తికముచే సమాసము. ఈ సూత్రముచే ప్ర అను ఉపసర్గకు పరమైన అధ్వన్ శబ్దమునకు అచ్ ప్రత్యయము (ప్రాధ్వన్ + అ) 'నస్తద్ధితే' అను సూత్రముచే టి (అన్) లోపము. (ప్రాధ్వ్ + అ) = ప్రాధ్వః.

**సూ :- న పూజనాత్ 5-4-69**

వృ:- పూజనార్థాత్పరేభ్యః సమాసాంతా న స్యుః; సురాజా, అతిరాజా.

పూజనార్థకమునకు పరమందున్న శబ్దములపై సమాసాంత ప్రత్యయములు రావు.

**సూ:- స్వతిభ్యామేవ**

పై సూత్రముచే చెప్పబడిన నిషేధము సు, అతి అను పూజనార్థక శబ్దములపై నుండు శబ్దములకు మాత్రమే వర్తించును. సు, అతి కాక తక్కిన పూజనార్థములగు శబ్దములు పూర్వపదములుగా నున్నపుడు సమాసాంతప్రత్యయములకు నిషేధము లేదు.

సురాజా: శోభనశ్చాసౌ రాజా చ అను నర్థమున 'కుగతిప్రాదయః' అను సూత్రముచే సుశబ్దమునకు రాజన్ శబ్దముతో సమాసము. ఇట సు అనునది పూజనార్థకమగుటచే 'న పూజనాత్' అను సూత్రముచే సమాసాంత ప్రత్యయము నిషేధింపబడుటచే 'రాజాహః సఖిభ్యష్టచ్' అను సూత్రముచే వచ్చు టచ్ ప్రత్యయము రాదు.

అతిరాజా : రాజానం అతిక్రాంతః అను నర్థమున 'అంత్యాదయ క్రాంతాద్యర్థే ద్వితీయయా' అను వార్తికముచే అతి శబ్దమునకు రాజన్ శబ్దముతో సమాసము - ఇట అతి శబ్దము పూజనార్థకమగుటచే 'న పూజనాత్' అను సూత్రముచే సమాసాంత ప్రత్యయము నిషేధింపబడుటచే 'రాజాహః సఖిభ్యష్టచ్' అను సూత్రముచే వచ్చు టచ్ప్రత్యయము రాదు.

ఇతి సమాసాంతాః.

# అథ స్త్రీప్రత్యయాః

**సూ : స్త్రియామ్ 4-1-3**

వృ:- అధికారోఽయం సమర్థానామితి యావత్

ఇది అధికార సూత్రము. ఇది 'సమర్థానాం ప్రథమాద్వా' అను సూత్రమువరకు అధికరించును. అనగా 'సమర్థానాం ప్రథమాద్వా' అను సూత్రమువరకు విధింపబడిన ప్రత్యయములన్నియు స్త్రీత్వ వివక్షయందు వచ్చునని భావము.

**సూ : అజాద్యతష్టాప్ 4-1-4**

వృ : అజాదీనామకారాంతస్య చ వాచ్యం యత్ స్త్రీత్వం తత్ర ద్యోత్యే టాప్ స్యాత్; అజా. ఏడకా, అశ్వా, చటకా, మూషికా, బాలా, వత్సా, హోడా, మందా, విలాతా ఇత్యాది; మేధా, గంగా, సర్వా.

అజాది గణములో పేర్కొబడిన ప్రాతిపదికములకును, అకారాంత ప్రాతిపదికములకును వాచ్యమగు అర్థమందలి స్త్రీత్వము ద్యోత్యమగునపుడు వానిపై 'టాప్' ప్రత్యయము వచ్చును.

**అజా :** అజ అనునది అజాది గణ పఠితమగు ప్రాతిపదికము. ఏతద్వాచ్యమగు అర్థమందలి స్త్రీత్వము ద్యోత్యమగునపుడు 'అజ' అను ప్రాతిపదికముపై టాప్ (అ) ప్రత్యయము, పిదప సవర్ణదీర్ఘము రాగా అజా అని యేర్పడును. ఇట్లే ఏడక, చటక, మూషిక, బాల, వత్స, హోడ, మంద, విలాత అను అజాది గణపఠిత శబ్దములపైనను

స్త్రీత్వము ద్యోత్యమగునపుడు ఈ సూత్రముచే టాప్ ప్రత్యయము వచ్చి ఏడకా, చటకా, మూషికా, బాలా, వత్సా, హోడా, మందా, విలాతా అను రూపము లేర్పడును.

సర్వా : సర్వ శబ్దము హ్రస్వ అకారాంతమగు ప్రాతిపదిక మగుటచే దీనిపై స్త్రీత్వము ద్యోత్యమగునపుడు ఈ సూత్రముచే టాప్ ప్రత్యయము రాగా, సవర్ణదీర్ఘముచే 'సర్వా' అని యగును.

అజాది గణమున పఠింపబడిన అజ, ఏడక, చటక మున్నగు శబ్దములు హ్రస్వ అకారాంతములగుటచేతనే వానిపై ఈ సూత్రముచే టాప్ ప్రత్యయము వచ్చుచుండగా మరల వానిని అజాదిగణమున పఠించుట వ్యర్థము కదా అని ఆశంక వచ్చును. అజ, ఏడక, చటక, మూషిక శబ్దములపై 'జాతేరస్త్రీ విషయాదయోపధాత్' అను సూత్రముచే వచ్చు జీష్ ప్రత్యయము, బాల, వత్స, హోడ, మంద, విలాత అను శబ్దములపై 'వయసి ప్రథమే' అను సూత్రముచే వచ్చు జీప్ ప్రత్యయము రాకుండుటయే వీనిని అజాదిగణమున పఠించుటకు కారణము.

**సూ : ఉగితశ్చ 4.1.6.**

వృ : ఉగిదంతాత్ ప్రాతిపదికాత్ స్త్రియాం జీప్ స్యాత్, భవతీ, భవంతీ, పచంతీ, దీవ్యంతీ

ఉక్ అనగా ఉ, ఋ, ఌ అను వర్ణములు. ఇత్సంజ్ఞకములగు నీ మూడు వర్ణము లంతమందుగల ప్రాతిపదికపై స్త్రీత్వము ద్యోత్యమగునపుడు జీప్ ప్రత్యయము వచ్చును.

భవతీ : భాధాతువుపై డవతు (అవత్) ప్రత్యయము చేర్చగా భవత్ అని యగును. దీనిపై స్త్రీత్వము ద్యోత్యమగునపుడు ఈ సూత్రముచే ఙీప్ (ఈ) ప్రత్యయము రాగా 'భవతీ' అని యగును.

భవంతీ : భూ ధాతువుపై శతృ ప్రత్యయము రాగా భవత్ అని కాగా 'శప్ శ్యనోర్నిత్యమ్' అను సూత్రముచే నుమాగమము రాగా 'భవంత్' అని యగును. ఇది ఉగిదంతమగు ప్రాతిపదికమగుటచే దీనిపై ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము రాగా 'భవంతీ' అని యగును. పంచతీ, దీవ్యంతీ అను రూపములు కూడ భవంతీ అను రూపమువలెనే సిద్ధించును.

సూ : టిడ్ఢాణఞ్ ద్వయసజ్దఘ్నఞ్ మాత్రచ్ తయప్ ఠక్ ఠఞ్ కఞ్ క్వరపః 4.1.15

వృ : అనుపసర్జనం యట్టిదాది తదంతం యదదంతం ప్రాతిపదికం తతః స్త్రియాం ఙీప్ స్యాత్, కురు చరీ, నదట్ నదీ, దేవట్ దేవీ, సౌపర్ణేయీ, ఐంద్రీ, ఔత్సీ, ఊరుద్వయసీ, ఊరుదఘ్నీ, ఊరుమాత్రీ, పంచతయీ, ఆక్షికీ, లావణికీ యాదృశీ, ఇత్వరీ.

టిత్, ఢ, అణ్, అఞ్, ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్, తయప్, ఠక్, ఠఞ్, కఞ్, క్వరప్-వీనికి ద్వంద్వము. 'ప్రత్యయగ్రహణే తదంతస్యాపి గ్రహణమ్' అను న్యాయముచే (ప్రత్యయమును గ్రహించినపుడు ప్రత్యయాంతమును కూడ గ్రహింపవలెను) ఢ ప్రత్యయాంతము అణ్ ప్రత్యయాంతము ఇత్యాద్యర్థము లభించును. టకారమిద్వర్ణముగా కలది టిత్తు.

ఇత్సంజ్ఞకమగు టకారమును, ఢ, అణ్, అఞ్, ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్, తయప్, ఠక్, ఠఞ్, కఞ్, క్వరప్ అను ప్రత్యయములను అంతమందు గల అదంత ప్రాతిపదికపై స్త్రీత్వమున ఙీప్ ప్రత్యయము వచ్చును.

టిత్వము కొన్నిచోట్ల ప్రత్యయకృతము, కొన్నిచోట్ల స్వతస్సిద్ధము, మరికొన్నిచోట్ల ధాతుకృతమును కావచ్చును.

**కురుచరీ :** కురుషు చరతీతి అను అర్థమున కురు + చర్ అనుచోట 'చరేష్టః' అను సూత్రముచేత 'ట' (అ) ప్రత్యయము రాగా 'కురుచర' అని యగును. ఇట కురుచర అనునది ప్రత్యయకృతమైన టిత్వముగల ప్రాతిపదికము. అదంతము కూడ. కనుక ఈ సూత్రముచే కురుచర శబ్దముపై ఙీప్ (ఈ) ప్రత్యయము (కురుచర + ఈ), 'యస్యేతి చ' అను సూత్రముచే రేఫమందలి అకారమునకు లోపమును రాగా 'కురుచరీ' అని యగును.

**నదీ :** దీనికి నదట్ అనునది ప్రాతిపదిక. టకార మిద్వర్ణమై లోపించి 'నద' అని మిగులును. ఇట టిత్వము ప్రాతిపదికగతము. టిత్త గుటచే నద శబ్దముపై దీనిచే ఙీప్ ప్రత్యయము (నద + ఈ), దకారము మీది అకారమునకు లోపము రాగా 'నదీ' అని యగును.

**సౌపర్ణేయీ :** సుపర్ణాయా అపత్యం స్త్రీ (సుపర్ణయొక్క కూతురు) అను అర్థమున సుపర్ణా శబ్దముపై 'స్త్రీభ్యో ఢక్' అను సూత్రముచే ఢక్ ప్రత్యయము, దానికి 'ఏయ' ఆదేశము, ఆదివృద్ధి, అకారమునకు లోపము రాగా సౌపర్ణేయ అని యగును. ఇది ఢక్ ప్రత్యయాంతమైన అకారాంత ప్రాతిపదిక యగుటచే దీనిపై ఙీప్ ప్రత్యయము పిదప అకారలోపము రాగా 'సౌపర్ణేయీ' అని యగును.

**ఐంద్రీ :** ఇంద్రో దేవతా అస్య (ఇంద్రుడు దేవతగా కలది) అను అర్థమున ఇంద్రశబ్దముపై 'సాఽస్య దేవతా' అను సూత్రముచే అణ్ ప్రత్యయము, పిదప ఆదివృద్ధి, అకారమునకు లోపము రాగా ఐంద్ర అని యగును. ఇది అణ్ ప్రత్యయాంతమైన అకారాంత శబ్దమగుటచే దీనిపై ఙీప్ ప్రత్యయము, పిదప అకారలోపము రాగా 'ఐంద్ర అని యగును.

**ఔత్సీ :** ఉత్సస్య ఇయమ్ (ఉత్సుడను ఋషికి సంబంధించినది) అను అర్థమున ఉత్స శబ్దముపై 'ఉత్సాదిభ్యోఽఞ్' అను సూత్రముచే అఞ్ ప్రత్యయము పిదప ఆదివృద్ధి, అకారలోపము రాగా ఔత్స అని యగును. ఇది అఞ్ప్రత్యయాంత ప్రాతిపదిక యగుటచే దీనిపై స్త్రీత్వ వివక్షలో ఙీప్ ప్రత్యయము, పిదప అకారలోపము రాగా ఔత్సీ అని యగును.

**ఊరుద్వయసీ :** ఊరూ ప్రమాణమస్యాః (ఊరువులు ప్రమాణముగా కలది) అను అర్థమున ఊరు శబ్దముపై 'ప్రమాణే ద్వయసచ్' అను సూత్రముచే ద్వయసచ్ ప్రత్యయము రాగా ఊరుద్వయస అని యగును. ఇది ద్వయసచ్ ప్రత్యయాంతమైన ప్రాతిపదిక యగుటచే దీనిపై స్త్రీత్వ వివక్షలో ఙీప్ ప్రత్యయము, పిదప అకారలోపము రాగా ఊరుద్వయసీ అని సిద్ధించును.

**ఊరుదఘ్నీ :** ఊరూ ప్రమాణమస్యాః (ఊరువులు ప్రమాణముగా కలది) అను అర్థమున ఊరు శబ్దముపై 'ప్రమాణే ద్వయసచ్' అను సూత్రముచే దఘ్నచ్ ప్రత్యయము, ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము, పిదప అకారలోపము రాగా ఊరుదఘ్నీ అను రూపము సిద్ధించును.

**ఊరుమాత్రీ :** ఊరూ ప్రమాణమస్యాః (ఊరువులు ప్రమాణముగా కలది) అని అర్థమున ఊరు శబ్దముపై "ప్రమాణే ద్వయసచ్........." అను సూత్రముచే మాత్రచ్ ప్రత్యయము-ఈ సూత్రముచే ఙీప్ప్రత్యయము, పిదప అకారలోపము రాగా ఊరుమాత్రీ అను రూపము సిద్ధించును.

**పంచతయీ :** పంచ అవయవా అస్య (ఐదు అవయవములు కలది.) అను అర్థమున 'సంఖ్యాయా అవయవే తయప్' అను సూత్రముచే

పంచ శబ్దముపై తయప్ ప్రత్యయము-ఈ సూత్రముచే జీప్ ప్రత్యయము రాగా పిదప అకారలోపము వచ్చి 'పంచతయీ' అని అగును.

**ఆక్షికీ :** అక్షైర్దీవ్యతి (పాచికలతో ఆడునది) అను అర్థమున అక్ష శబ్దముపై 'తేన దీవ్యతి........ ఖనతి జయతి జితమ్" అను సూత్రముచే అక్ష శబ్దముపై ఠక్ ప్రత్యయము; దానికి 'ఠస్యేకః' అను సూత్రముచే ఇకాదేశము, పిదప అకారలోపము రాగా ఆక్షిక అని యగును. ఇది ఠక్ ప్రత్యయాంతమైన అకారాంతప్రాతిపదికయగుటచే దీనిపై ఈ సూత్రముచే జీప్ ప్రత్యయము. పిదప అకారలోపము రాగా ఆక్షికీ అని సిద్ధించును.

**లావణికీ :** లవణం పణ్యమస్యాః (లవణము అమ్మకపు వస్తువుగా కలది) అను అర్థమున లవణ శబ్దముపై 'లవణాట్ఠఞ్' అను సూత్రముచే ఠఞ్ ప్రత్యయము. దానికి ఇకాదేశము. పిదప అకారలోపము రాగా 'లావణిక' అని అగును. ఇది ఠఞ్ ప్రత్యయాంతమైన అకారాంత ప్రాతి పదిక యగుటచే దీనిపై ఈ సూత్రముచే జీప్ ప్రత్యయము, పిదప అకార లోపము వచ్చి లావణికీ అని యేర్పడును.

**యాదృశీ :** (ఎట్టిదో) యాదృశ్ శబ్దముపై 'త్యదాదిషు చ' అను సూత్రముచే కఞ్ (అ) ప్రత్యయము రాగా యాదృశ అని యగును. కఞంతమగుటచే దీనిపై ఈ సూత్రముచే జీప్ ప్రత్యయము, (యాదృశ + ఈ) పిదప అకార లోపము (యాదృశ్ + ఈ) రాగా యాదృశీ అని యగును.

**ఇత్వరీ :** ఇఞ్ దాతువుపై క్వరప్ (వర) ప్రత్యయము, 'హ్రస్వస్య పితి కృతి తుక్' అను సూత్రముచే తుగాగమము రాగా ఇత్వర అని యగును. క్వరప్ ప్రత్యయాంతమగు ప్రాతిపదిక యగుటచే దీనిపై ఈ సూత్రముచే జీప్ ప్రత్యయము, (ఇత్వర + ఈ) పిదప అకారలోపము (ఇత్వర్ + ఈ) వచ్చి ఇత్వరీ అని యగును.

వా : నఞ్స్నఞీకక్ ఖ్యుం స్తరుణతలునానాముపసంఖ్యానమ్

నఞ్, స్నఞ్, ఈకక్, ఖ్యున్ ప్రత్యయాంతములకును, తరుణ, తలున శబ్దములకును జీప్ ప్రత్యయమును చెప్పవలెను.

స్త్రైణీ : 'స్త్రీ పుంసాభ్యాం నఞ్స్నఞౌ' అను సూత్రముచే స్త్రీ శబ్దముపై నఞ్ (న) ప్రత్యయము, పిదప ఆదివృద్ధి, ణత్వము రాగా స్త్రైణ అని యగును. ఇది నఞ్ ప్రత్యయాంతమగు ప్రాతిపదికయగుటచే దీనిపై ఈ వార్తికముచే జీప్ ప్రత్యయము (స్త్రైణ + ఈ), పిదప అకార లోపము వచ్చి స్త్రైణీ అని యగును.

పౌంస్నీ : పుంస్ శబ్దముపై 'స్త్రీపుంసాభ్యాం నఞ్స్నఞౌ' అను సూత్రముచే స్నఞ్ (స్న) ప్రత్యయము, పిదప ఆదివృద్ధి, రాగా పౌంస్న అని యగును. ఇది స్నఞ్ ప్రత్యయాంతమగు ప్రాతిపదిక యగుటచే దీనిపై ఈ వార్తికముచే జీప్ ప్రత్యయము (పౌంస్న + ఈ), పిదప అకారలోపము వచ్చి పౌంస్నీ అని యగును.

శాక్తీకీ : 'శక్తియష్ట్యోరీకక్' అను సూత్రముచే శక్తి శబ్దముపై ఈకక్ (ఈక) ప్రత్యయము, "కితి చ' సూత్రముచే ఆదివృద్ధి, పిదప ఇకారలోపము రాగా 'శాక్తీక' అని యగును. దీనిపై ఈ వార్తికముచే జీప్ ప్రత్యయము. పిదప అకారలోపము రాగా శాక్తీకీ అని సిద్ధించును.

యాష్టీకీ :- 'శక్తి యష్ట్యోరీకక్' అను సూత్రముచే యష్టి శబ్దముపై ఈకక్ (ఈక) ప్రత్యయము, 'కితి చ' సూత్రముచే ఆదివృద్ధి, పిదప ఇకారలోపము రాగా యాష్టీక అనియగును. దీనిపై ఈ వార్తికముచే జీప్ ప్రత్యయము, పిదప అకారలోపము రాగా యాష్టీకీ అని సిద్ధించును.

**ఆఢ్యంకరణీ :** ఆఢ్య + కృ అని యుండగా 'ఆఢ్యసుభగస్థూల పలిత నగ్నాంధప్రియేషు చ్వ్యర్థేష్వచ్వౌ కృఞః కరణే ఖ్యున్' అను సూత్రముచే ఖ్యున్ (యు) ప్రత్యయము. దీనికి 'యువోరనాకౌ' అను సూత్రముచే అనాదేశము. పిదప ణత్వము వచ్చి 'ఆఢ్యంకరణ' అని యగును. ఇది ఖ్యున్ ప్రత్యయాంత ప్రాతిపదిక యగుటచే దీనిపై ఈ వార్తికముచే ఙీప్ ప్రత్యయము. పిదప అకారలోపము వచ్చి ఆఢ్యంకరణీ అని యగును.

తరుణీ
తలునీ } : తరుణ, తలున శబ్దములపై స్త్రీత్వవివక్షలో ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము - పిదప ఆకారలోపము రాగా తరుణీ, తలునీ అను రూపము లేర్పడును.

**సూ : యఞశ్చ 4-1-16**

వృ : యఞంతాత్ స్త్రియాం ఙీప్ స్యాత్; అకారలోపే కృతే.

యఞ్ ప్రత్యయాంతమగు శబ్దముపై స్త్రీత్వ వివక్షలో ఙీప్ ప్రత్యయము వచ్చును.

గర్గస్య గోత్రాపత్యం స్త్రీ అను అర్థమున గర్గ శబ్దముపై 'గర్గాదిభ్యో యఞ్' అను సూత్రముచే యఞ్ ప్రత్యయము. పిదప ఆది వృద్ధి, అకారలోపము రాగా గార్గ్య అని యగును. ఇది యఞంతమగుటచే దీనిపై ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము (గార్గ్య + ఈ), పిదప అకార లోపము రాగా గార్గ్య్ + ఈ అని యగును. తక్కిన ప్రక్రియ తరువాతి సూత్రమున చూడనగును.

సూ : హల స్తద్ధితస్య 6.4.150

వృ: హలః పరస్య తద్ధితయకారస్య ఉపధాభూతస్య లోప ఈతి పరే; గార్గీ.

హల్లునకు పరమైనదియు, ఉపధావర్ణమును అగు తద్ధితయకారమునకు 'ఈ' వర్ణము పరమగునపుడు లోపము వచ్చును.

గార్గ్య + ఈ అనుచోట గార్గ్య శబ్దములోని యకారము తద్ధిత యకారము. హల్లునకు పరమైనది. ఉపధా వర్ణము కూడ. ఈ కారము పరమందున్నది. కనుక ఈ సూత్రముచే యవర్ణమునకు లోపము రాగా (గార్గ్ + ఈ) గార్గీ అను రూపమేర్పడును.

సూ : ప్రాచాం ష్ఫ తద్ధితః 4-1-17

వృ : యఞంతాత్ ష్ఫో వా స్యాత్, స చ తద్ధితః;

యఞంతమైన శబ్దముపై ష్ఫ ప్రత్యయము వికల్పముగా వచ్చును. అది తద్ధితము. దీని సమన్వయము తరువాతి సూత్రమున చూడనగును.

సూ : షిద్గౌరాదిభ్యశ్చ 4.1.44

వృ : షిద్భ్యో గౌరాదిభ్యశ్చ స్త్రియాం జీష్ స్యాత్. గార్గ్యాయణీ, నర్తకీ, గౌరీ, అనడుహీ, అనడ్వాహీ, అకృతిగణోఽయమ్.

షకారమిద్వర్ణముగాగల శబ్దములపైనను, గౌరమున్నగు శబ్దముల పైనను స్త్రీత్వ వివక్షలో జీష్ ప్రత్యయము వచ్చును.

**గార్గ్యాయణీ** : గర్గస్య గోత్రాపత్యం స్త్రీ అను అర్థమున గర్గ శబ్దముపై 'గర్గాదిభ్యో యఞ్' అనుసూత్రముచే యఞ్ ప్రత్యయము రాగా గార్గ్య అని యగును. యఞంతమగుటచే దీనిపై ఈ సూత్రముచే 'ష్ఫ' (ఫ)

ప్రత్యయము. 'ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్' అను సూత్రముచే ష్ఫ ప్రత్యయమునకు 'ఆయన్' అదేశము, పిదప ణత్వము వచ్చి 'గార్గ్యాయణ' అని యగును. ఇది ష్ఫ ప్రత్యయాంత మైన శబ్దమగుటచే షిత్తైన శబ్దము - కనుక దీనిపై స్త్రీత్వ వివక్షలో ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము (గార్గాయణ + ఈ). పిదప అవర్ణలోపము రాగా గార్గ్యాయణీ అని యగును.

**గౌరీ** : గౌరాది గణమున నుండుటచే గౌరశబ్దముపై ఈ సూత్ర ముచే జీష్ ప్రత్యయము (గౌర + ఈ),పిదప అకారలోపము రాగా 'గౌరీ' అని యగును.

**అనడ్వాహీ** : అనడుహ్ శబ్దముపై 'ఆమనడుహః స్త్రియాం వా వాచ్యః' అను వార్తికముచే 'ఆమ్' ప్రత్యయము వచ్చిన పక్షమున 'అన డ్వాహ్' అని యగును. ఇది గౌరాదులలో నుండుటచే దీనిపై స్త్రీత్వ వివక్షలో ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము రాగా అనడ్వాహీ అని యగును.

**అనడుహీ** : 'ఆమనడుహః స్త్రియాం వా వాచ్యః' అను వార్తి కముచే అనడుహ్ శబ్దమునకు వచ్చు ఆమాదేశము వైకల్పికమగుటచే నది రాని పక్షమున అనడుహ్ అనియే యుండును. కనుక దానిపై ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము వచ్చి అనడుహీ అని యగును.

గౌరాదిగణము ఆకృతి గణము. అనగా ఇందు చెప్పిన పదములనే కాక జీష్ రాదగిన మరికొన్ని శబ్దములను కూడ ఈ గణములో పరిగణన చేయవలసి ఉండునని భావము.

సూ : వయసి ప్రథమే 4.2.30

వృ : ప్రథమవయోవాచినో ఽ దంతాత్ స్త్రియాం ఙీప్ స్యాత్ - కుమారీ.

తొలి వయస్సును తెలుపు హ్రస్వ - అకారాంత శబ్దముపై స్త్రీత్వ వివక్షలో ఙీప్ ప్రత్యయము వచ్చును.

**కుమారీ :** కుమార శబ్దము తొలివయస్సు (కౌమారము)[1]ను తెలుపు శబ్దముకనుక దానిపై స్త్రీత్వవివక్షలో ఙీప్ ప్రత్యయము, పిదప అకార లోపము రాగా 'కుమారీ' అని సిద్ధించును.

సూ : ద్విగోః 4.1.21

అదంతా ద్విగోః ఙీప్ స్యాత్. త్రిలోకీ, అజాదిత్వాత్ త్రిఫలా; త్ర్యనీకా సేనా.

హ్రస్వ - అకారాంతమగు ద్విగు శబ్దముపై ఙీప్ ప్రత్యయము వచ్చును.

**త్రిలోకీ :** త్రయాణాం లోకానాం సమాహారః త్రిలోకీ. సంఖ్యా పూర్వకమగుటచే త్రిలోక శబ్దము ద్విగు సమాసము. అకారాంతమగు ఈ ద్విగు సమాసముపై ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము (త్రిలోక + ఈ) పిదప అకారలోపము రాగా 'త్రిలోకీ' అని యగును.

త్రయాణాం ఫలానాం సమాహారః త్రిఫలా. త్రిఫల శబ్దము కూడ ద్విగు సమాసమగుటచే ఈ సూత్రముచే ఙీప్ ప్రత్యయము రావలసి

---

1. కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావధి
   కైశోరమాపంచదశా ద్యౌవనం తు తతః పరమ్.

యున్నది. కాని త్రిఫల శబ్దము అజాదిగణమున పఠింపబడుటచే 'అజా ద్యతష్టాప్' అను సూత్రముచే టాప్ ప్రత్యయము వచ్చి 'త్రిఫలా' అనియే యగును. త్రిఫలీ అని కాదు.

ఇట్లే త్రయాణాం అనీకానాం సమాహారః త్ర్యనీకా. త్ర్యనీక శబ్దము కూడ ద్విగు సమాసమే. ఐనను అది అజాది గణపఠితమగుటచే దానిపై అజాద్యతష్టాప్ అను సూత్రముచే టాప్ ప్రత్యయము వచ్చి త్ర్యనీకా అనియే యగును. త్ర్యనీకీ అనికాదు.

**సూ : వర్ణాదనుదాత్తాత్తోపధాత్తో నః 4-1-39**

వర్ణవాచీ యోఽనుదాత్తాంతః తోపధః, తదంతా దను పసర్జనాత్ ప్రాతిపదికాత్ వా ఙీష్, తకారస్య నకారాదేశశ్చ. ఏనీ, ఏతా; రోహిణీ, రోహితా.

అనుదాత్తాంతమును, తకారోపధమును అగు వర్ణ-వాచకమంత మందుగల అనుపసర్జనమగు ప్రాతిపదికపై వికల్పముగ ఙీష్ వచ్చును. తకారమునకు నకారాదేశము కూడ వచ్చును.

**ఏనీ, ఏతా :** ఏత శబ్దము చిత్రవర్ణ వాచకము. 'వర్ణానాం తణతి నితాంతానామ్' అను సూత్రముచే తాంతమగు ఈ ఏతశబ్దము ఆద్యుదాత్తమగుటచే 'అనుదాత్తం పద మేకవర్జమ్' అను సూత్రముచే అంతోదాత్తము. అనుప సర్జనము కూడ. కనుక ఏత అను ప్రాతి పదికపై ఈ సూత్రముచే ఙీష్ ప్రత్యయమును, తకారమునకు నకారా దేశమును వచ్చును. ఙీష్ ప్రత్యయము వచ్చిన పక్షమున ఏత + ఈ అనుచోట తకారమునకు నకారాదేశమును, అకారలోపమును రాగా ఏనీ అని యగును. ఙీష్ రాని పక్షమున టాప్ ప్రత్యయము వచ్చి 'ఏతా' అని యగును.

**రోహితా, రోహిణీ :** రోహిత శబ్దము రక్తవాచకము. అనుదాత్తాంతము. అనుపసర్జనము. కనుక దీనిపై ఈ సూత్రముచే ఙీష్ ప్రత్యయమును, తకారమునకు నకారాదేశమును రాగా రోహిన + ఈ అని యగును. పిదప నకారమునకు ణత్వము, అకారలోపము రాగా రోహిణీ అని యగును. ఙీష్ రాని పక్షమున టాప్ ప్రత్యయము వచ్చి రోహితా అని యగును.

**సూ : వోతో గుణవచనాత్ 4-1-44**

వృ : ఉదంతాత్ గుణవాచినో వా ఙీష్ స్యాత్; మృద్వీ, మృదుః

హ్రస్వ - ఉకారాంతమైన గుణవాచక శబ్దముపై ఙీష్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

**మృద్వీ :** మృదు శబ్దము హ్రస్వ-ఉకారాంతమైన గుణవాచక శబ్దము. స్త్రీత్వ వివక్షలో దీనిపై ఈ సూత్రముచే ఙీష్ ప్రత్యయము రాగా యణాదేశము వచ్చి మృద్వీ అని యగును. ఙీష్ ప్రత్యయము వికల్పమగుటచే నది రాని పక్షమున మృదుః అని యగును.

శుచి మున్నగు శబ్దములు ఉకారాంతములు కానందునను, ఆఖు మొదలగు శబ్దములు ఉకారాంతములైనను గుణవాచకములు కానందునను వాటిపై దీనిచే ఙీష్ రాదు.

**సూ : బహ్వాదిభ్యశ్చ 4-1-45**

**వృ: ఏభ్యో వా ఙీష్ స్యాత్; బహ్వీ, బహుః**

**బహు మున్నగు శబ్దములపై** ఙీష్ ప్రత్యయము వికల్పముగ **వచ్చును.**

స్త్రీత్వవివక్షలో బహుశబ్దముపై జీష్ ప్రత్యయము రాగా యణా దేశము వచ్చి బహ్వీ అని యగును. జీష్ ప్రత్యయము రాని పక్షమున స్త్రీలింగమునను బహుః అనియే యుండును.

వా:- కృదికారాద క్తినః,
రాత్రీ, రాత్రిః

క్తిన్ ప్రత్యయావయవ భిన్నమగు కృత్ప్రత్యయ సంబంధియైన ఇకారము అంతమందుగల పదముపై జీష్ప్రత్యయము వికల్పముగ వచ్చును.

రా ధాతువుపై 'రాశదిభ్యాం త్రిప్' అను సూత్రముచే త్రిప్ అను ఔణాదిక ప్రత్యయము రాగా 'రాత్రి' అను శబ్దమేర్పడును. త్రిలోని ఇకారము కృత్ప్రత్యయసంబంధి యగుటచే తదంతమగు రాత్రి శబ్దముపై దీనిచే జీష్ప్రత్యయము రాగా, పిదప ఇకారలోపముచే (రాత్ + ఈ) రాత్రీ అని యగును.

క్తిన్ ప్రత్యయసంబంధి యగు ఇకారమంతమందుగల శబ్దములకు జీష్ నిషేధముండుటచే కృతి, భృతి మున్నగు శబ్దములపై జీష్ రాదు.

వా:- సర్వతోఽక్తిన్నర్థాదిత్యేకే
శకటీ, శకటిః

'కృదికారాద క్తినః' అను వార్తికములోని అక్తినః అను పదమునకు క్తిన్నర్థప్రత్యయావయవభిన్నమగు అని అర్థమని కొందరి అభిప్రాయము. దీని ప్రకారము స్త్రీ ప్రత్యయము రావలసిన ప్రాతిపదికము కృదంతము కానవసరము లేదు. దానియందలి ఇకారము క్తిన్నర్థప్రత్యయావయవము కాకున్న చాలును. అందువలన శకటి ఇత్యాదులయందు జీష్ ప్రత్యయము వికల్పముగ వచ్చి శకటీ, శకటిః అను రూపము లేర్పడును.

సూ :- పుంయోగాదాఖ్యాయామ్ 4-1-48

యా పుమాఖ్యా పుంయోగాత్ స్త్రియాం వర్తతే తతో ఙీష్; గోపస్య స్త్రీ గోపీ.

సూత్రమందలి పుమ్ శబ్దము లుప్తషష్ఠీకము. పుంసః అని భావము. దీని నావృత్తి చేసి వానిలో ఒకదానిని యోగాత్ అను పదముతోను, రెండవదానిని ఆఖ్యాయామ్ అను పదముతోను అన్వయింపవలెను. స్త్రియామ్ అను సూత్రమిందధికరించును. ఏతావతా ఏ పురుషవాచక శబ్దము పురుష సంబంధమువలన స్త్రీని బోధించునో అట్టి అదంత పురుష వాచక శబ్దముపై ఙీప్ ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

గోపీ : గోపస్య స్త్రీ అను పురుషవాచక శబ్దము గోపునికి, వాని స్త్రీకిని గల దాంపత్య సంబంధమును బట్టి గోప సంబంధియగు స్త్రీని చెప్పుటచే గోప శబ్దముపై దీనిచే ఙీష్ ప్రత్యయము రాగా పిదప అకార లోపముచే గోపీ అని యగును. గోపీ అనగా గోపాలకుని భార్య అని అర్థము. గోవులను పాలించు స్త్రీ అని కాదు.

వా :- పాలకాంతాన్న.

'పుంయోగాదాఖ్యాయామ్' అను సూత్రముచే విధింపబడిన ఙీప్ ప్రత్యయము పాలకశబ్దమంతమందుగల శబ్దముపై రాదు. దీని వివరణము తరువాతి సూత్రమున చూడనగును.

సూ : ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాత ఇదాప్యసుపః 7-3-44

వృ : ప్రత్యయస్థాత్ కాత్ పూర్వస్య అకారస్య ఇకారః స్యాదాపి, స ఆప్ సుపః పరో న చేత్; గోపాలికా, అశ్వపాలికా, సర్వికా, కారికా, అతః కిమ్? నౌకా; ప్రత్యయస్థాత్ కిమ్? శక్నోతీతి శకా; అసుపః కిమ్? బహుపరివ్రాజకా నగరీ.

ప్రత్యయగతమైన కవర్ణమునకు పూర్వమందున్న అకారమునకు ఆప్ ప్రత్యయము పరమందున్నపుడు ఇకారము ఆదేశముగ వచ్చును. ఆప్ ప్రత్యయము సుప్ ప్రత్యయమునకు పరముగ ఉండనపుడే ఈ ఆదేశము వచ్చును.

గోపాలకశబ్దముపై స్త్రీత్వవివక్షలో టాప్ ప్రత్యయము రాగా గోపాలక అని యగును. ఇట ణ్వుల్ ప్రత్యయగతమైన కకారమునకు పూర్వమందున్న అకారమునకు సుప్ ప్రత్యయమునకు పరముగ లేని ఆప్ ప్రత్యయము పరముగ నున్నందున ఇకారమాదేశముగ వచ్చి గోపాలికా అని యగును. ఇట్లే అశ్వపాలికా, సర్వికా, కారికా అను శబ్దములయందు ప్రత్యయగతమైన కకారమునకు పూర్వమందున్న అకారమునకు ఆప్ పరమగుటచే ఈ సూత్రముచే ఇకారమాదేశమైనది.

నౌకా అనుచోట ప్రత్యయగతమైన కకారమున్నప్పటికి దానికి పూర్వమందు అకారములేదు కనుక ఇట ఇకారాదేశము రాదు.

శక్నోతీతి శకా అను చోట కకారము ప్రత్యయగతము కాదు. ధాతుగతము. కనుక దానికి పూర్వమందున్న అకారమునకు ఇకారాదేశము రాదు.

బహవః పరివ్రాజకా యస్యాః సా బహుపరివ్రాజకా అను బహువ్రీహి సమాసమున పరివ్రాజక శబ్దమునకు పరముగ నున్న ప్రత్యయమునకు 'సుపో ధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే లోపము - దానికి 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్" అను సూత్రముచే ప్రత్యయ లక్షణము చెప్పినచో నిట ఆప్ ప్రత్యయము సుప్పునకు పరమగుటచే నీ సూత్రముచే అకారమునకు ఇకారాదేశము రాదు.

వా:- సూర్యాద్దేవతాయాం చాబ్వాచ్యః

సూర్యశబ్దము సూర్యసంబంధినియగు స్త్రీ దేవతను అనగా ఛాయా దేవి మున్నగు దేవతలను బోధించునపుడు చాప్ ప్రత్యయము చెప్పవలెను.

సూర్యస్య స్త్రీ దేవతా అను నర్థమున సూర్యశబ్దముపై 'పుంయోగాదాఖ్యాయామ్' అను సూత్రముచే ఙీప్ ప్రత్యయము వచ్చుచుండగా ఈ సూత్రముచే చాప్ (అ) ప్రత్యయము రాగా సవర్ణ దీర్ఘముచే "సూర్యా' అని యగును.

సూర్య సంబంధిని యగు స్త్రీ దేవత కాక మానుషి యగుచో ఈ సూత్రముచే చాప్ ప్రత్యయము రాదు. సూర్యస్య స్త్రీ మానుషీ అను అర్థమున 'పుంయోగాదాఖ్యాయామ్' అను సూత్రముచే ఙీష్ ప్రత్యయము, పిదప 'సూర్యతిష్యాగస్త్య' అను సూత్రముచే యలోపము వచ్చి సూరీ అని యగును. సూరీ అనగా సూర్యసంబంధిని యగు కుంతి అని అర్థము. కుంతి దేవతకాదు. మానుషి.

**సూ: ఇంద్ర- వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడ, హిమా, రణ్య, యవ, యవన, మాతులా, చార్యాణామానుక్ 4-1-48**

వృ : ఏషామానుగాగమః స్యాత్ ఙీష్చ; ఇంద్రస్య స్త్రీ ఇంద్రాణీ, వరుణానీ, భవానీ, శర్వాణీ, రుద్రాణీ, మృడానీ

ఇంద్ర, వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడ, హిమ, అరణ్య, యవ, యవన, మాతుల, ఆచార్య అను శబ్దములకు ఙీష్ ప్రత్యయము వచ్చును. దానితోపాటు ఆనుక్ అనుఆగమము కూడ వచ్చును. ఇంద్ర, వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడఅను నీ ఆరు శబ్దములకును, మాతుల, ఆచార్య శబ్దములకును పుంయోగమున ఙీష్ ప్రత్యయము వచ్చును. తక్కిన శబ్దములకు ఏయేఅర్థములలోఙీష్ ప్రత్యయము వచ్చునో దిగువ వార్తికములలో తెలుపబడును.

**ఇంద్రాణీ :** ఇంద్రస్య స్త్రీ అను అర్థమున ఇంద్ర శబ్దముపై ఙీష్ ప్రత్యయము, ఆనుగాగమము (ఇంద్ర + ఆన్ + ఈ) రాగా సవర్ణదీర్ఘము, నకారమునకు ణత్వము వచ్చి 'ఇంద్రాణీ' అని యగును. ఇట్లే వరుణస్య స్త్రీ అను అర్థమున వరుణానీ, భవస్య స్త్రీ అను అర్థమున భవానీ, శర్వస్య స్త్రీ అను అర్థమున శర్వాణీ, రుద్రస్య స్త్రీ అను అర్థమున రుద్రాణీ, మృడస్య స్త్రీ అను అర్థమున మృడానీ, మాతులస్య స్త్రీ మాతులానీ, ఆచార్యస్య స్త్రీ ఆచార్యాణీ అను రూపములు ఏర్పడును. ఈ రూపములలో 'పుంయోగాదాఖ్యాయామ్' అను సూత్రముచేతనే ఙీష్ ప్రత్యయము వచ్చు చుండగా ఈ సూత్రము ఇట ఆనుగాగమము మాత్రము విధించుచున్నదని తెలియవలెను. యవ, యవన మొ॥ ఇతర శబ్దముల మీద మాత్రము ఈ సూత్రముచే ఙీష్ ప్రత్యయము, ఆనుగాగమము - రెండును విధింపబడు చున్నవి.

వా: హిమారణ్యయోర్మహత్త్వే

హిమ, అరణ్య శబ్దములపై గొప్పనైన అను అర్థములో ఙీష్ ప్రత్యయము, ఆనుగాగమము వచ్చునని చెప్పవలెను.

**హిమానీ :** మహత్ హిమమ్ (అధికమగు మంచు) అను అర్థమున 'ఇంద్రవరుణ....' అను పూర్వ సూత్రముచే వచ్చు ఙీష్ ప్రత్యయము, ఆనుగాగమము ఈ వార్తికముచే మహదర్థమున నియతమై హిమానీ (హిమ + ఆన్ + ఈ) అని యగును.

అరణ్యానీ : మహత్ అరణ్యమ్ (పెద్ద అడవి) అను అర్థమున అరణ్య శబ్దముపై ఙీష్, ఆనుగాగమము (అరణ్య + ఆన్ + ఈ) రాగా సవర్ణదీర్ఘముచే అరణ్యానీ అని యగును.

వా : యవాద్దోషే

యవ శబ్దముపై దోషార్థమున జీష్ ప్రత్యయమును, ఆనుగాగమమును వచ్చునని చెప్పవలెను.

యవానీ : దుష్టో యవః (చెడిపోయిన యవధాన్యము) అను అర్థమున యవ శబ్దముపై 'ఇంద్రవరుణ....' అను సూత్రముచే జీష్ ప్రత్యయము, ఆనుగాగమము (యవ + ఆన్ + ఈ) రాగా సవర్ణదీర్ఘముచే 'యవానీ' అని యగును.

వా : యవనాల్లిప్యామ్

యవన శబ్దముపై వచ్చు జీష్ ప్రత్యయము, ఆనుగాగమము 'లిపి' అనునర్థమున వచ్చునని చెప్పవలెను.

యవనానీ : యవనానాం లిపిః అను అర్థమున యవనశబ్దముపై జీష్ ప్రత్యయమును, ఆనుగాగమమును (యవన + ఆన్ + ఈ) రాగా సవర్ణదీర్ఘముచే యవనానీ అను రూపమేర్పడును.

వా : మాతులోపాధ్యాయయోరానుగ్వా

'ఇంద్ర, వరుణ, భవ....' అను సూత్రముచే విధింపబడు ఆనుగాగమము మాతుల, ఉపాధ్యాయ శబ్దములకు వికల్పమని చెప్పవలెను.

మాతులానీ : 'మాతులస్య స్త్రీ' అను నర్థమున 'ఇంద్రవరుణ....' అను సూత్రముచే జీష్ ప్రత్యయము, అనుగాగమము (మాతుల + ఆన్ + ఈ) రాగా సవర్ణదీర్ఘముచే మాతులానీ అని యగును.

'ఇంద్రవరుణ....' అను సూత్రముచే వచ్చు ఆనుగాగమము ఈ వార్తికముచే మాతులశబ్దముపై వైకల్పికమగుటచే ఆనుగాగమము రాని పక్షమున జీష్ ప్రత్యయము మాత్రమే వచ్చి (మాతుల + ఈ) 'యస్యేతి చ' అను సూత్రముచే అకారము లోపించి 'మాతులానీ' అను రూపమేర్పడును.

వా : ఆచార్యాదణత్వం చ

ఆచార్య శబ్దముపై ఆనుగాగమము వచ్చినపుడు దానిలోని నకారమునకు ణత్వము రాదు.

ఆచార్యానీ ; ఆచార్యస్య స్త్రీ అను అర్థమున 'ఇంద్రవరుణ....' అను సూత్రముచే జీష్ ప్రత్యయము, ఆనుగాగమము (ఆచార్య + ఆన్ + ఈ) రాగా 'రషాభ్యాం నో ణః....' అను సూత్రముచే నకారమునకు ణత్వము ప్రాప్తించగా ఈ సూత్రముచే ణత్వము నిషేధింపబడి సవర్ణ దీర్ఘముచే 'ఆచార్యానీ' అను రూపమేర్పడును.

వా : అర్యక్షత్రియాభ్యాం వా స్వార్థే

అర్య, క్షత్రియ అను శబ్దములపై స్వార్థమున వికల్పముగా జీష్ ప్రత్యయమును, ఆనుగాగమమును వచ్చును.

అర్యాణీ : అర్య శబ్దముపై స్వార్థమున ఈ వార్తికముచే జీష్ ప్రత్యయము, ఆనుగాగమము (అర్య + ఆన్ + ఈ) రాగా సవర్ణదీర్ఘము, ణత్వము వచ్చి అర్యాణీ అని యగును.

అర్యా : ఈ వార్తికముచే వచ్చు జీష్ ప్రత్యయము, ఆనుగాగమము వైకల్పికమగుటచే నవి రాని పక్షమున అర్యశబ్దముపై 'అజాద్యత ష్టాప్

అను సూత్రముచే టాప్ ప్రత్యయము రాగా సవర్ణదీర్ఘముచే అర్యా అని యగును.

అర్యాణీ, అర్యా అనగా స్వామిని, వైశ్యజాతి స్త్రీ అని యర్థము.

**క్షత్రియాణీ :** క్షత్రియ శబ్దముపై ఈ వార్తికముచే స్వార్థమున అనుగాగమము, ఙీష్ ప్రత్యయము రాగా క్షత్రియ + అన్ + ఈ అని కాగా ణత్వము వచ్చి క్షత్రియాణీ అని యగును.

**క్షత్రియా :** క్షత్రియా శబ్దముపై ఈ వార్తికముచే వచ్చు ఙీష్ ప్రత్యయము వైకల్పికము కనుక నది రాని పక్షమున 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే టాప్ ప్రత్యయము రాగా క్షత్రియా అని యగును.

క్షత్రియా, క్షత్రియాణీ అను శబ్దములకు క్షత్రియ స్త్రీ అని యర్థము క్షత్రియుని భార్య అని కాదు.

**సూ : క్రీతాత్ కరణపూర్వాత్ 4.1.50**

వృ : క్రీతాంతాత్ అదంతాత్ కరణాదేః స్త్రియాం ఙీష్ స్యాత్. వస్త్రక్రీతీ; క్వచిన్న. ధనక్రీతా.

క్రీత శబ్దమంతమందుగల అదంతకరణవాచకముపై స్త్రీత్వము వివక్షించినపుడు ఙీష్ ప్రత్యయము వచ్చును.

వస్త్రక్రీతీ : వస్త్రేణ క్రీతా అను అర్థమున వస్త్రక్రీత అనుచోట క్రీత శబ్దమంత మందుండుట చేతను, పూర్వ శబ్దము కరణవాచకమగుట చేతను ఈ సూత్రముచే ఙీష్ ప్రత్యయము (వస్త్ర క్రీత + ఈ), యస్యేతి చ అను సూత్రముచే అకార లోపము రాగా వస్త్రక్రీతీ అని యగును.

క్వ చిన్న - ధనక్రీతా

కొన్ని ఉదాహరణములలో ఈ జీష్ ప్రత్యయము రాదు. ఉదా : ధనక్రీతా; ధనేన క్రీతా ధనక్రీతా అనుచోట క్రీత శబ్దమంతమందున్నది. పూర్వపదము అకారాంతమైన కరణవాచకము. ఐనను 'క్రీతాత్ కరణ పూర్వాత్' అను సూత్రముచే రావలసిన జీష్ ప్రత్యయము రాక టాప్ ప్రత్యయమే వచ్చి ధనక్రీతా అని యగును.

**సూ : స్వాంగాచ్చోపసర్జనాదసంయోగోపధాత్ 4.1.54**

వృ : అసంయోగోపధముపసర్జనం యత్ స్వాంగం తదంతా - దదంతాత్ జీష్ వా స్యాత్. కేశానతిక్రాంతా అతికేశీ, అతికేశా; చంద్రముఖీ, చంద్రముఖా.

సంయోగముపధగా లేనిదియు, ఉపసర్జనమును అగు స్వాంగ వాచకము అంతమందుగల హ్రస్వ - అకారాంత శబ్దముపై స్త్రీత్వము ద్యోత్యమగునపుడు జీష్ ప్రత్యయము వికల్పముగా వచ్చును.

**అతికేశీ, అతికేశా :** కేశానతిక్రాంతా అతికేశీ, అతికేశా. ఇట అతికేశ శబ్దము స్వాంగవాచకము. స్త్రీ ప్రధానమగుటచే ఉపసర్జనము కూడ. ఇందు సంయోగముపధగా లేదు. కనుక అతికేశ శబ్దముపై స్త్రీత్వము ద్యోత్యమగునపుడు ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము రాగా అతికేశ + ఈ అని కాగా అకార లోపముచే అతికేశీ అని యగును.

ఈ సూత్రముచే విధింపబడు జీష్ ప్రత్యయము వికల్పమగుటచే నిది రాని పక్షమున 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే టాప్ ప్రత్యయము వచ్చి అతికేశా అని యగును.

**చంద్రముఖీ, చంద్రముఖా :** చంద్ర ఇవ ముఖం యస్యాః సా అని విగ్రహ వాక్యము. చంద్రముఖ శబ్దము అసంయోగోపధము, ఉప సర్జనము అగు స్వాంగవాచకము అంతమందు గలదగుటచే దీనిపై ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము పచ్చి, పిదప అకార లోపముచే చంద్ర ముఖీ అగును. జీష్ ప్రత్యయము వికల్ప మగుటచే నిది రాని పక్షమున టాప్ ప్రత్యయము వచ్చి చంద్రముఖా అని యగును.

శోభనౌ గుల్ఫౌ యస్యాః సా అను అర్థమున సుగుల్ఫ శబ్దమున గుల్ఫ శబ్దము సంయోగోపధమగుటచే ఈ సూత్రముచే జీష్ రాదు. టాప్ వచ్చి సుగుల్ఫా అని యగును.

శిఖా అను పదము అసంయోగోపధమే ఐనను ఉపసర్జనముకాదు కనుక దీనిపై ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము రాదు.

**సూ :- న క్రోడాదిబహ్వచః 4-1-56**

క్రోడాదే ర్బహ్వచశ్చ స్వాంగాన్న జీష్; కళ్యాణక్రోడా, ఆకృతి గణోఽయమ్. సుజఘనా.

క్రోడ మున్నగు శబ్దములు కాని, రెంటికన్న అధికమైన అచ్చులు కలది కాని అగు స్వాంగవాచక శబ్దము అంతమందుగల ప్రాతిపదికముపై జీష్ ప్రత్యయము రాదు. ''స్వాంగాచ్చోపసర్జనాత్...'' అను సూత్ర ముచే విధింపబడిన జీష్ ప్రత్యయానికి ఇది నిషేధము.

**కళ్యాణక్రోడా :** కళ్యాణీ క్రోడా యస్యాః సా అని విగ్రహము. పుంవద్భావముచే కళ్యాణీ శబ్దము కళ్యాణ అని యగును. సమాసమున క్రోడా శబ్దములోని చివరి దీర్ఘము హ్రస్వమై కళ్యాణక్రోడ అని యగును. ఇట 'స్వాంగాచ్చోపసర్జనాత్....' అను సూత్రముచే వైకల్పికముగా జీష్ ప్రత్యయము వచ్చుచుండగా ఈ సూత్రము దానిని నిషేధించుచున్నది. నుక జీష్ రాక టా ప్రత్యయమే వచ్చి కళ్యాణక్రోడా అని యగును.

క్రోడాది గణము ఆకృతిగణము. ఈ గణమునందు పఠింపబడిన పదములనే కాక ఇట్టి శబ్దాలను ప్రయోగములను బట్టి మరి కొన్నింటిని కూడా గ్రహింపవచ్చునని భావము.

సుజఘనా : శోభనం జఘనం యస్యాః సా; సుజఘన అను ప్రాతిపదికపై 'స్వాంగాచ్చోపసర్జనాత్....' అను సూత్రముచే జీష్ ప్రత్యయము వచ్చుచుండగా జఘన శబ్దము బహ్వచ్కమగు స్వాంగవాచకశబ్దమగుటచే ఈ సూత్రముచే దానికి నిషేధము. కనుక జీష్‌రాక టాప్రత్యయమే వచ్చి సుజఘనా అని యగును.

సూ: నఖముఖాత్సంజ్ఞాయామ్ 4-1-58

వృ: న జీష్

నఖ, ముఖ శబ్దములంతమందుగల ప్రాతిపదికము సంజ్ఞావాచకమైన పక్షమున దానిపై జీష్ రాదు. దీనికి తరువాతి సూత్రమున సమన్వయము చూడనగును.

సూ: పూర్వపదాత్సంజ్ఞాయామగః 8-4-3

వృ: పూర్వపదస్థాన్నిమిత్తాత్ పరస్య నస్య ణః స్యాత్ సంజ్ఞాయాం, నతు గకారవ్యవధానే; శూర్పణఖా, గౌరముఖా, సంజ్ఞాయాం కిమ్? తామ్రముఖీ కన్యా

పూర్వపదమందున్న నిమిత్తముకంటె పరమైన నకారమునకు సంజ్ఞార్థమున ణత్వము వచ్చును. గకారముతో వ్యవధానమున్నపుడు మాత్రము రాదు.

శూర్పణఖా : శూర్పా ఇవ నఖా యస్యాః సా అని విగ్రహము. శూర్పణఖ అని యుండగా 'స్వాంగాచ్చోపసర్జనాత్' అను సూత్రముచే జీష్ప్రత్యయము ప్రాప్తించుచున్నది. కాని ఇది నఖశబ్దమంతమందుగల సంజ్ఞావాచకమగుటచే 'నఖముఖాత్సంజ్ఞాయామ్' అను సూత్రముచే జీష్ నిషేధింపబడుచున్నది. కాగా టాప్ ప్రత్యయమే వచ్చి 'శూర్పనఖా' అని యగును. ఇది సంజ్ఞావాచక శబ్దమగుటచే పూర్వమందున్న ణత్వనిమిత్తక మైన రేఫకు పరమందున్న నఖ శబ్దములోని నకారమునకు ణత్వము రాగా శూర్పణఖా అని యగును.

గౌరముఖా : గౌరం ముఖం యస్యాః సా అని విగ్రహము. గౌరముఖ శబ్దముపై 'స్వాంగాచ్చోపసర్జనాత్....' అను సూత్రముచే జీష్ ప్రాప్తించుచుండగా ఇది సంజ్ఞావాచకమగుటచే 'నఖముఖాత్ సంజ్ఞాయామ్' అను సూత్రముచే దానికి నిషేధము. కాగా టాప్ ప్రత్యయము వచ్చి గౌరముఖా అని యగును.

నఖ, ముఖాంతమగు శబ్దము సంజ్ఞావాచకమైనపుడే 'నఖముఖాత్....' అను సూత్రముచే జీష్ నిషేధము. 'తామ్రముఖీ' (ఎర్రని ముఖము గలది) అనునది ముఖశబ్దాంతమైనను సంజ్ఞావాచకము కాక పోవుటచే జీష్ నిషేధము రాదు. కనుక జీష్ ప్రత్యయమే వచ్చి తామ్రముఖీ అని యగును. తామ్రముఖా అని కాదు.

**సూ : జాతేరస్త్రీ విషయాదయోపధాత్ 4-1-63**

వృ : జాతివాచి యన్న స్త్రియాం నియతమయోపధం తతః **స్త్రియాం జీష్ స్యాత్, తటీ, వృషలీ, కఠీ, బహ్వృచీ, జాతేఃకిమ్? ముండా; అస్త్రీవిషయాత్ కిమ్? బలాకా; అయోపధాత్ కిమ్? క్షత్రియా.**

సూత్రమందలి అస్త్రీ విషయాత్ అను పదమునకు నిత్య స్త్రీలింగము కాని అని అర్థము. కనుక నిత్య స్త్రీ లింగమును, యకారోపధమును కానట్టి జాతి వాచక శబ్దముపై స్త్రీత్వవివక్షయందు జీష్ ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

ఇక్కడ జాతి స్వరూపమును మూడు విధములుగ గ్రహింపవలెను. ఆ మూడు విధములగు జాతి స్వరూపము ఈ కింది శ్లోకమున పేర్కొన బడినది.

ఆకృతిగ్రహణా జాతిర్లింగానాం చ న సర్వభాక్
సకృదాఖ్యాతనిర్గ్రాహ్యా గోత్రం చ చరణైః సహ

**ఆకృతిగ్రహణా జాతిః**

ఒకే రీతిగనుండు అవయవ సన్నివేశముచే పోల్చదగినది జాతి. ఇట్టి ఆకారము గలది గోవు, ఇట్టి ఆకారము గలది తటి అని ఆకృతిని చెప్పుటవలన తెలియదగినది జాతియని భావము. ఉదా: **తటీః-** జలసమీప దేశవిశేష రూపమగునది తటమనుటచే తటత్వము జాతి యగును. జాతివాచకమగు తట శబ్దముపై ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము వచ్చి (తట + ఈ) అకార లోపముచే తటీ అని యగును.

**లింగానాం చ న సర్వభాక్, సకృదాఖ్యాతనిర్గ్రాహ్యా**

దేనికి మూడు లింగములుండవో, ఏది [illegible] వ్యక్తిలో ఒక మారు చెప్పినచో అతని కుమారుడు మొదలగువారియందు తిరిగి చెప్పనక్కర లేకుండగనే గ్రహింపబడునో అది జాతి. ఉదా:- వృషలీ. వృషలత్వము జాతి. దీనియందు పుంలింగస్త్రీలింగములు మాత్రమే ఉండుటచే ఇది

మూడు లింగములుగల శబ్దము కాదు. ఒకరిని చూపి ఇతడు వృషలుడని చెప్పినచో ఆతని పుత్రులందును, సోదరులందును వృషలత్వము చెప్పకయే గ్రహింపబడును. కనుక వృషలత్వము జాతి. అట్టి జాతివాచకశబ్దముపై ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము (వృషల + ఈ), పిదప అకారలోపము వచ్చి వృషలీ అని యగును.

### గోత్రం చ చరణైః సహ

ఇట గోత్ర శబ్దముచే 'అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్' అను సూత్రముచే విధింపబడు గోత్రముచే పౌత్రులు మొదలగు గోత్రము గ్రహింపబడును. ఇది లౌకికగోత్రము కాదు. శాస్త్రీయ గోత్రము. చరణ శబ్దము వేదశాఖలను అధ్యయనము చేయువానిని బోధించును. కనుక గోత్రాపత్యార్థమున విధింపబడిన అణాది ప్రత్యయములు అంతమందుగల శబ్దములును, వేదశాఖల నధ్యయనము చేయు వారిని తెలుపు శబ్దములును జాతివాచకములగునని భావము.

ఔపగవశబ్దము గోత్రాపత్యార్థమున అణ్ప్రత్యయమురాగా ఏర్పడిన రూపము. దీనిపై స్త్రీత్వవివక్షలో 'టిడ్ఢాణఞ్....' అను సూత్రముచే జీప్ ప్రత్యయము వచ్చుచుండగ ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము వచ్చి (ఔపగవ + ఈ) అకారము లోపించి ఔపగవీ అని యగును.

కఠ, బహ్వృచ శబ్దములు వేదశాఖల నధ్యయనము చేయువారిని తెలుపు శబ్దములగుటచే నివి జాతివాచకములు. కనుక స్త్రీత్వవివక్షలో ఈ సూత్రముచే జీష్ ప్రత్యయము, పిదప అకారలోపము రాగా కఠీ, బహ్వృచీ అను రూపము లేర్పడును.

జాతేః కిమ్? ముండా

కనుక జాతివాచకముపై విధింపబడిన జీష్ ప్రత్యయము ముండ శబ్దముపై ముండ శబ్దమునకు గొరగబడినది అను అర్థము కావున జాతి వాచకము కాదు, రాదు. టాప్ ప్రత్యయమే వచ్చి ముండా అని యగును.

అస్త్రీవిషయాత్ కిమ్? మక్షికా

నిత్య స్త్రీలింగముకాని పదముపైననే జీష్ విధింపబడినది కనుక నిత్య స్త్రీలింగమైన మక్షికాశబ్దముపై ఈ సూత్రముచే జీష్ రాదు. టాప్ ప్రత్యయమే వచ్చును.

అయోపధాత్ కిమ్? క్షత్రియా.

యకారముపధగా లేని శబ్దముపైనే జీష్ విధింపబడినది కనుక యకారోపధమైన క్షత్రియ శబ్దముపై ఈ సూత్రముచే జీష్ రాదు. టాప్ ప్రత్యయమే వచ్చును.

వా : యోపధప్రతిషేధే హయ, గవయ, ముకయ, మనుష్య, మత్స్యానామప్రతిషేధః.

యకారోపధములగు శబ్దములకు జీష్ నిషేధము రావలసినపుడు హయ, గవయ, ముకయ, మనుష్య, మత్స్య అను శబ్దములకు ప్రతిషేధము చెప్పవలెను.

'జాతేరస్త్రీవిషయాదయోపధాత్' అను సూత్రమున యకారోపధములకు జీష్ నిషేధింపబడినది. కాని ఈ వార్తికముచే హయ, గవయ, ముకయ, మనుష్య, మత్స్య శబ్దములు యకారోపధములైనను వీనికి జీష్ ప్రత్యయము వచ్చునని తాత్పర్యము. ఉదా: హయీ. గవయీ, ముకయీ, మనుషీ. మత్సీ, మనుష్య శబ్దమునందలి యకారమునకు 'హలస్తద్ధితస్య' అను సూత్రమునుచేత లోపము.

వా : మత్స్యస్య ఙ్యామ్, యలోపః

మత్స్య శబ్దమునకు ఙీ పరముగానున్నపుడు యలోపము వచ్చును. ఉదా: మత్సీ.

సూ : ఇతో మనుష్యజాతేః 4-1-65

మనుష్యజాతి వాచకమగు హ్రస్వ - ఇకారాంతశబ్దముపై స్త్రీత్వ వివక్షలో ఙీష్ ప్రత్యయము వచ్చును.

దాక్షీ : దక్షస్య గోత్రాపత్యం స్త్రీ అను అర్థమున 'అత ఇఞ్' అను సూత్రముచే ఇఞ్ ప్రత్యయము రాగా దాక్షి అని యగును. హ్రస్వే కారాంతమగు మనుష్యజాతి వాచకమగుటచే దీనిపై స్త్రీత్వ వివక్షలో ఙీష్ (ఈ) ప్రత్యయము రాగా ఇతర లోపముచే దాక్షీ అని యగును.

సూ :- ఊఙుతః 4-1-66

వృ : ఉదంతాదయోపధాత్ మనుష్యజాతివాచినః స్త్రియాం ఊఙ్ స్యాత్; కురూః, అయోపధాత్ కిమ్? అధ్వర్యుర్బ్రాహ్మణీ.

మనుష్యజాతి వాచకమును, యకారముపధగా లేనిదియు అగు హ్రస్వ-ఉకారాంత శబ్దముపై స్త్రీత్వవివక్షలో ఊఙ్ప్రత్యయము వచ్చును.

కురూః : కురుశబ్దము మనుష్యజాతివాచకమగు హ్రస్వ ఉకారాంత శబ్దము. ఇందులో యకారముపధగా లేదు. కనుక దీనిపై స్త్రీత్వవివక్షలో ఊఙ్ (ఊ) ప్రత్యయము వచ్చి సవర్ణదీర్ఘముచే 'కురూ' అని యగును.

యకారముపధగా కల శబ్దములపై మాత్రము ఊఙ్ప్రత్యయము రాదనుటచే 'అధ్వర్యుః బ్రాహ్మణీ' అనుచోట అధ్వర్యు శబ్దము హ్రస్వో కారాంతమగు జాతివాచక శబ్దమైనను యకారోపధమగుటచే దీనిపై ఊఙ్ రాదు. అధ్వర్యూః అని రాదని భావము.

సూ : పంగోశ్చ 4-1-68

పంగూః

పంగు శబ్దముపైనను స్త్రీత్వవివక్షలో ఊఙ్ ప్రత్యయము వచ్చును.

పంగూః : పంగు శబ్దముపై ఈ సూత్రముచే స్త్రీత్వవివక్షలో ఊఙ్ (ఊ) రాగా సవర్ణదీర్ఘముచే పంగూః అని యగును.

వా : శ్వశురస్యోకారాకారలోపశ్చ

శ్వశురశబ్దమునకు స్త్రీత్వవివక్షలో ఊఙ్ప్రత్యయము (శ్వశుర + ఊ) ఇందలి ఉకార, అకారములకు లోపము (శ్వశ్ర్ + ఊ) రాగా శ్వశ్రూ అని యగును.

సూ : ఊరూత్తరపదాదౌపమ్యే 4-1-69

వృ : ఉపమానవాచి పూర్వపదమూరూత్తరపదం యత్ ప్రాతిపదికం తస్మాత్ ఊఙ్ స్యాత్; కరభోరూః

ఉపమానవాచకము పూర్వపదముగను, ఊరు శబ్దముత్తరపదముగను కల ప్రాతిపదికపై ఊఙ్ ప్రత్యయము వచ్చును.

కరభోరూః : కరభావివ స్నిగ్ధౌ ఊరూ యస్యాః సా కరభోరూః (కరభములవలె స్నిగ్ధములైన తొడలు గలది) ఉపమానవాచకమగు కరభ శబ్దము పూర్వపదముగను, ఊరు శబ్దముత్తరపదముగను ఉండుటచే కరభోరు అను ప్రాతిపదికపై దీనిచే ఊఙ్ ప్రత్యయము రాగా సవర్ణదీర్ఘముచే కరభోరూః అని యగును.

వా : సంహితశఫలక్షణవామాదేశ్చ

సంహిత, శఫ, లక్షణ, వామ మున్నగు శబ్దములు పూర్వపదములుగను, ఊరుశబ్దముత్తరపదముగను కల ప్రాతిపదికపైనను స్త్రీత్వవివక్షలో ఊఙ్ ప్రత్యయము వచ్చును.

పూర్వ సూత్రముచే ఊరుశబ్దము త్తరపదముగా గల ప్రాతిపదికము ఉపమాన పూర్వపదముగా నున్నపుడే ఊఙ్ ప్రత్యయము విధింపబడినది. ఈ సూత్రముచే పూర్వపద ముపమాన వాచకము కానపుడు ఊఙ్ ప్రత్యయము విధింపబడుచున్నది.

**సంహితోరూః :** సంహితౌ ఊరూ యస్యాః సా సంహితోరూః (కలిసిన ఊరువులు కలది) సంహితోరు శబ్దముపై ఈ సూత్రముచే ఊఙ్ ప్రత్యయము, పిదప సవర్ణదీర్ఘము వచ్చి 'సంహితోరూః' అని యగును. ఇట్లే శఫోరూః (శఫౌ ఊరూ యస్యాః సా; ఖురములవలె సంశ్లిష్టమైన ఊరువులు కలది) లక్షణోరూః (లక్షణౌ ఊరూ యస్యాః సా; లక్షణవంత ములైన ఊరువులు కలది) వామోరూః (వామౌ ఊరూ యస్యాః సా; అందమైన ఊరువులు గలది) అను రూపములును ఊఙ్ ప్రత్యయముచే సిద్ధించును.

**సూ : శార్ఙ్గరవాద్యఞో ఙీన్ 4.1.73**

వృ : శార్ఙ్గరవాదేరఞో యోఽకారః తదంతాచ్చ జాతి వాచినో ఙీన్ స్యాత్; శార్ఙ్గరవీ, బైదీ, బ్రాహ్మణీ

శార్ఙ్గరవాది అనునది లుప్తపంచమ్యంతము. అఞః అనునది షష్ఠ్యంతము. ఇది అతః అనుదానికి విశేషణము. దీనినిబట్టి శార్ఙ్గరవ మొదలైన జాతివాచక శబ్దముల పైనను, అఞ్ ప్రత్యయానికి సంబంధించిన అకార మంతమందుగల జాతివాచక శబ్దములపైనను ఙీన్ ప్రత్యయము వచ్చును.

**శార్ఙ్గరవీ :** శృంగరోరపత్యం స్త్రీ (శృంగరువుయొక్క కూతురు) అను అర్థమున శృంగరు శబ్దముపై 'తస్యాపత్యమ్' అను సూత్రముచే అణ్ ప్రత్యయము (శృంగరు + అ) ఆదివృద్ధి (శార్ఙ్గరు + అ) గుణము, అవాదేశము రాగా శార్ఙ్గరవ అని అగును. జాతివాచకమగు దీనిపై ఈ సూత్రముచే జీన్ ప్రత్యయము, పిదప ఆకారలోపము రాగా శార్ఙ్గరవీ అని సిద్ధించును.

**బైదీ :** బిదస్య గోత్రాపత్యం స్త్రీ (బిదుడను ఋషియొక్క వంశమున జన్మించిన స్త్రీ) అను అర్థమున 'అనృష్యానంతర్యే బిదాదిభ్యోఽఞ్' అను సూత్రముచే అఞ్ ప్రత్యయము, పిదప ఆదివృద్ధి, అకారలోపము రాగా బైద అని యగును. ఇది అఞ్ ప్రత్యయానికి సంబంధించిన అకారమంతమందుగల జాతి వాచకము కనుక దీనిచే జీన్ ప్రత్యయము. పిదప అకారలోపము రాగా బైదీ అని యగును.

**బ్రాహ్మణీ :** బ్రాహ్మణస్య స్త్రీ అను అర్థమున బ్రాహ్మణ శబ్దముపై ఈ సూత్రముచే జీన్ ప్రత్యయము, పిదప అకార లోపము వచ్చి బ్రాహ్మణీ అని యగును.

వా : నృనరయోర్వృద్ధిశ్చ.

నృ, నరశబ్దములపై స్త్రీత్వమును వివక్షించినపుడు జీన్ ప్రత్యయమును, వృద్ధియును వచ్చును.

**నారీ :** నృశబ్దముపై ఈ సూత్రముచే జీన్ ప్రత్యయమును; వృద్ధియును రాగా నారీ అను రూపమేర్పడును.

నరశబ్దముపై ఈ సూత్రముచే జీన్ ప్రత్యయమును, వృద్ధియును రాగా నార + ఈ అని యగును. రేఫముమీది అకారము లోపించి నారీ అను రూపము సిద్ధించును.

జీప్ ప్రత్యయము ఞిత్తు, ణిత్తు, కిత్తును కాకుండుటచే ఆదివృద్ధి వచ్చుటకు వీలు లేదు. కనుక ఈ వార్తికము ప్రత్యేకముగా వృద్ధిని విధించు చున్నది.

సూ : యూనస్తిః 4.1.77

వృ : యువన్‌శబ్దాత్ స్త్రియాం తిః ప్రత్యయః స్యాత్ - యువతిః

యువతి :- యువన్ శబ్దముపై స్త్రీత్వవివక్షలో ఈ సూత్రముచే 'తి' ప్రత్యయము రాగా యువన్ + తి అని యగును. పిదప 'నలోపః ప్రాతిపదికాంతస్య' అను సూత్రముచే నకార లోపము వచ్చి యువతిః అని యగును.

స్త్రీ ప్రత్యయప్రకరణం సమాప్తం.

